

# కులాన్ని అర్థం చేసుకోవడం ఎలా?

కె. బాలగోపాల్

మానవహక్కుల వేదిక ప్రచురణ
Human Rights Forum (HRF)

మానవహక్కుల వేదిక ప్రచురణ

**Human Rights Forum Publication**

ప్రచురణ సంఖ్య: 56

ప్రచురణ కాలం : ఏప్రిల్ 2023

వెల : రూ. 50/-

**ముద్రణ :**
అనుపమ ప్రింటర్స్, గ్రీన్ వ్యూ,
126 శాంతినగర్, హైదరాబాద్ - 28
ఫోన్ : 23391364, 233041941
Email: anupamaprinters@yahoo.co.in

**ప్రతులకు:**
బి.ఎన్. సుబ్బన్న, 9441241380
ఎ. చంద్రశేఖర్, 7993919499

మా వెబ్‌సైట్: www.humanrightsforum.org

బాలగోపాల్ రచనల కోసం: www.balagopal.org

# ముందుమాట

భారతదేశంలో కులం ఒక ప్రధాన అంశం. కులమే సమాజంలోని అనేక అసమానతలకు మూలం అయింది. విపరీతమైన అంతరాలను వ్యవస్థీకృతం చేసింది. చాలా కులాలకు హక్కులను నిరాకరించింది. అంటరానితనానికి కారణం అయింది. వృత్తులవారీ వ్యవస్థలను బలపరిచింది. పుట్టుకే అన్నీ నిర్ణయించేలా చేసింది. పుట్టుకతోనే కొందరికి సామాజిక హోదా, గౌరవం. అవకాశాలు ఇవ్వడమే కాదు. అత్యధికులకు ఎటువంటి హక్కులూ లేకుండా చేసింది.

ఈ కారణంగా కులం గురించిన చర్చ సమాజంలో ఎప్పటినుండో జరుగుతూ వస్తున్నది. బుద్ధుడు, చార్వాకుల కాలం నుండి అంబేడ్కర్, పూలే, పెరియార్, నారాయణ గురుల దాకా ఎందరో కులం గురించి విస్తృతంగా రాశారు. దాని దుష్పరిణామాలను విపులంగా వివరించారు. ఇటీవల కాలంలో కొందరు కులం క్రమంగా అంతరించి పోతున్నదని, దాని ప్రాధాన్యత క్రమంగా తగ్గిపోతున్నదని మాట్లాడుతున్నారు. పట్టణీకరణ పెరగడం వల్ల, ఆధునిక సాంకేతికత వల్ల, విద్యా స్థాయి విస్తరించడం వల్ల సమాజంలో కులవ్యవస్థ తగ్గిందని వారి అభిప్రాయం. ఇందులో కొంత వాస్తవం ఉండవచ్చేమో కాని కులం పోలేదు. అది కాలానికి తగినట్టు రూపాన్ని, స్వభావాన్ని మార్చుకుంటున్నదని మనకు స్పష్టంగా తెలుస్తోంది.

కాబట్టి కులం పుట్టుక, చారిత్రక నేపథ్యం వంటి అంశాలను అందరూ మరింత లోతుగా అర్థం చేసుకునేందుకు వీలుగా బాలగోపాల్ గారు గతంలో కులం మీద ఇచ్చిన ఒక ఉపన్యాసాన్ని (ఇది కులవ్యవస్థ–చారిత్రక భౌతికవాదం అనే పేరుతో youtube లో ఉంది.) transcribe చేసి పుస్తక రూపంలో తీసుకువస్తున్నాం. భారతదేశంలో మానవహక్కులకు మూలపురుషులైన జ్యోతిబా పూలే, డాక్టర్ బి.ఆర్ అంబేడ్కర్ జయంతుల సందర్భంగా ఈ పుస్తకాన్ని తీసుకురావడం సముచితంగా భావించాం. దీని ప్రధాన ఉద్దేశం భారతదేశంలో కులం పుట్టుకను, దాని ప్రభావాన్ని అందరూ చరిత్ర కోణం నుండి పరిశీలించి, అధ్యయనం చేసి, ప్రస్తుత సమాజంలో కులం పోషిస్తున్న పాత్రను సమర్థంగా అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాలనే.

బాలగోపాల్ గారు ఈ ప్రసంగంలో వేదకాలం నుండి నేటి కాలం వరకు కులం, కులవ్యవస్థ, వర్ణధర్మం ఎలా రూపు దిద్దుకుంటూ వచ్చాయో, మిగతా దేశాల్లో లేని వర్ణధర్మం మన దేశంలో మాత్రమే ఎందుకుందో విపులంగా చెప్పారు. కులానికి ఉత్పత్తి వ్యవస్థతో ఉన్న సంబంధాన్ని వివరించారు. మార్క్సిజం చెప్పే చారిత్రక భౌతికవాదం ఒక్కటే కులం, కులవ్యవస్థ, వర్ణధర్మాలను అర్థం చేసుకోవడానికి సరిపోదని అన్నారు. భారతదేశానికి మాత్రమే ప్రత్యేకమైన అనేక విషయాలను పరిగణనలోకి తీసుకుంటేనే ఈ మూడూ – కులం, కులవ్యవస్థ, వర్ణధర్మం అనేవి ఇంత అతి రూపం, తీవ్రరూపం ఎందుకు తీసుకున్నాయో అర్థమవుతుందని చెప్పారు. శూద్రులను సేవా రంగానికి పరిమితం చేయడాన్ని, స్త్రీలను కొన్ని పనులకు పరిమితం చేయడాన్ని ఒక కట్టడి, వివక్షగా మాత్రమే కాక శ్రమ దోపిడీకి అవకాశాలు పెంచిన ఒక ఉత్పత్తి సంబంధంగానే చూడాలన్నారు. పురుషసూక్తంలో, ఆ తర్వాత కాలంలో భగవద్గీత రూపంలో వేదాలలోకి, ఇతిహాసాలలోకి చొప్పించిన వర్ణవ్యవస్థకు, మారుతున్న ఉత్పత్తి వ్యవస్థకు ఉన్న లంకె గురించి సోదాహరణంగా వివరించారు. చివరగా "ప్రాచీన కాలంలో స్థిరపడుతున్నటువంటి వ్యవసాయక సమాజాన్నీ; మధ్యయుగాలలో స్థిరపడినటువంటి వ్యవసాయక సమాజంతో పాటు రెవెన్యూ యంత్రాంగాన్నీ; ఆధునిక కాలంలో వీటితో పాటు పెట్టుబడిదారీ సంబంధాలను కూడా లెక్కలోకి తీసుకుంటేనే మనకు వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ అనేవి సమగ్రంగా అర్థం కావచ్చు" అన్నారు.

ఇవి మచ్చుకు కొన్ని. రెండు గంటల ఈ ఉపన్యాసంలో ఇంకా చాలా విషయాలు ఉన్నాయి. అయితే విచారకరమైన విషయం ఏమిటంటే ఈ ఉపన్యాసం మాకు పూర్తిగా దొరకలేదు. కనీసం ఎక్కడ మాట్లాడారో, ఎప్పుడు మాట్లాడారో కూడా తెలియలేదు. కనుక్కోవడానికి మేము చేసిన ప్రయత్నాలూ ఫలించలేదు. సుమారుగా 1995–96 కావొచ్చు అనుకుంటున్నాం. ఇప్పటికైనా ఆ వివరాలు ఎవరైనా చెప్పగలిగితే సంతోషిస్తాం. మిగతా భాగం అందజేయగలిగితే మరింత సంతోషిస్తాం. అసంపూర్తిగా ఉన్నప్పటికీ కులాన్ని నిర్దిష్టంగా అర్థం చేసుకోవడానికి ఈ పుస్తకం ఉపయోగపడుతుందని మానవహక్కుల వేదిక భావిస్తున్నది. ఈ పుస్తకం అందరూ చదవాలని కోరుతున్నాం.

**మానవహక్కుల వేదిక, అనంతపురం శాఖ**

12 ఏప్రిల్ 2023

# కులాన్ని అర్థం చేసుకోవడం ఎలా?

## ఫ్రెండ్స్

కులాన్ని గురించి నేనైనా, వేరే ఎవరైనా సమగ్రంగా మాట్లాడగలుగుతారని నేను అనుకోను. కాబట్టి దాని గురించి నాకు ఉన్న అభిప్రాయాలు, తెలిసిన విషయాలు మాత్రం చెప్తాను. తరువాత అందరం కలిసి వివరంగా చర్చించుకుంటే ఆ చర్చల పర్యవసానంగా – పూర్తి సమగ్రంగా కాకపోయినా, కొంతవరకైనా దాన్ని డెవలప్ చేసి రాయడం సాధ్యమవుతుందేమో చూద్దాం.

మన దగ్గర సమసమాజం లేదా సామాజిక న్యాయం ఉన్న సమాజం రావాలి అనే ఆకాంక్ష చాలా బలంగా ఉంది. దాన్ని నెలకొల్పాలనే ఆకాంక్షతో అనేక ఉద్యమాలు, పోరాటాలు చాలాకాలంగా నడుస్తున్నాయి. అయితే సమసమాజం నిజంగా దగ్గరకు వస్తే మనలో ఎంతమందిమి దాన్ని ఆహ్వానిస్తామో అనుమానమే. దూరంగా ఉన్నప్పుడు ఆకర్షణీయంగా కనిపించేవాటిలో సమసమాజం ఒకటి. అదెలా ఉన్నా ఈ రోజు చాలామంది దానిని ఆహ్వానిస్తున్నారు. కాని కేవలం ఆహ్వానిస్తే సరిపోదు కదా! సమసమాజానికి ఆటంకంగా ఉండే విషయాలు ఏమిటి? దాన్ని సాధించాలంటే జరగాల్సిన కృషి ఏమిటి? ఈ విషయాల గురించి సమగ్రమైన ఆలోచన చేయడం అవసరం.

ఏదో ఒక రాజకీయ పంథాను గానీ, సిద్ధాంతాన్ని గానీ నమ్ముకోవడం తప్పు కాదు కానీ అదే పరమ సత్యం అని భావించడం మాత్రం కరెక్టు కాదు. నా జేబులో ఒక కిటుకు ఉంది, ఆ కిటుకుని అమలు చేస్తే అంతా అయిపోతుంది అనే వైఖరిని అందరూ వదిలిపెట్టి – ఒకరని కాదు, అందరూ వదిలిపెట్టి – మనం కోరుకునే న్యాయమైన సమాజం రావాలంటే ఇప్పుడున్న సమాజాన్ని ముందుగా కూలంకషంగా అర్థం చేసుకోవాలి. సమసమాజం ఏర్పడడానికి ఏయే ఆటంకాలు ఉన్నాయో వాటిని పూర్తిగా అర్థం చేసుకోవాలి, ఏ రకమైన ఆచరణ కావాలో అర్థం చేసుకోవాలి. అంటే అధ్యయనం చాలా అవసరం. అధ్యయనం అనేది ఉండవలసినంతగా ఉండటం లేదు ఉద్యమాల్లో అని భావించేవాళ్ళల్లో నేను ఒకడ్ని. వేరే ఏమీ కాకపోయినా, కులాన్ని గురించి వివరంగా అధ్యయనం చేయడానికి ఈ

సమావేశం ప్రోద్బలం ఇస్తుందని ఆశిస్తాను. పుస్తకాల నుంచే కాకుండా చుట్టూ ఉన్న సమాజాన్ని కూడా అధ్యయనం చేస్తే విషయాన్ని మరింత సమగ్రంగా తెలుసుకోగలుగుతాం.

మాది శ్రీవైష్ణవ శాఖకు చెందిన బ్రాహ్మణ కుటుంబం. ఇప్పుడది బ్రాహ్మణ కులంలో ఒక శాఖ కాని ఒకప్పుడు అది వైష్ణవానికి మొలిచిన ఒక బ్రాహ్మణ కొమ్మ. వైష్ణవం భారతదేశంలో ఒక దశలో ప్రజాతంత్ర మార్పుగా వచ్చింది. శూద్రులు కూలివాళ్ళుగా ఉన్న దశ నుంచి కొంత భూమి సంపాదించుకొని రైతులుగా మారుతున్న దశలో వాళ్ళకు కొంత గౌరవప్రదమైన స్థానాన్ని కల్పించడం కోసం; ముక్తి, మోక్షం అనేది అగ్రవర్ణాలకు మాత్రమే కాదు, శూద్రులకు కూడా సాధ్యమే అని చెప్పడం కోసం; ఆ ప్రయత్నం, ఆ ఆకాంక్షలో భాగంగా వైష్ణవం వచ్చింది. మొదట్లో అది ఒక బ్రాహ్మణ శాఖగా పుట్టలేదు. సుమారు రెండు వేల సంవత్సరాల కింద ఒక సాధారణ మత శాఖగానే పుట్టింది.

## అప్పట్లో సమానత్వమంటే మోక్షంలో సమానత్వమే

మొదట్లో బ్రాహ్మణ మతంలో శూద్రుడికి మోక్షం అనే ప్రసక్తే లేదు. తరువాత తరువాత కొంత మారుస్తూ వచ్చారు. ఎట్లా చేశారంటే – ప్రశ్నించకుండా, గొడవ చేయకుండా నీ కర్మలు నువ్వు ఆచరిస్తూ ఉంటే, అంటే నీ కుల ధర్మాన్ని నువ్వు ఆచరిస్తూ ఉంటే, వచ్చే జన్మలో ఇంకొంచెం మెరుగైన బ్రతుకు వస్తుంది; ఆ జన్మలో కూడా అడగకుండా, ప్రశ్నించకుండా నీ కర్మను నువ్వు ఆచరిస్తూ ఉంటే ఆ తరువాత ఇంకొంచెం మెరుగైన బ్రతుకు; అట్లా ఎప్పటికైనా మోక్షం రావొచ్చు అని చెప్పారు. తిరస్కరించినపుడు ఎవరి నుండైనా నిరసన వస్తుంది కదా. మీకు మాత్రమే మోక్షమా, మాకు మాత్రం ఎందుకు ఉండదు అని శూద్రులు ప్రశ్నిస్తారు కదా. ఆ నిరసనకు జవాబుగా ఈ ఇంకొంచెం వచ్చిందన్న మాట. అలాగే ఉత్పత్తి రంగంలో తమ స్థితి కొంచెం పెరిగాక శూద్రులలోనూ సమానత్వ ఆకాంక్ష పెరగడం సహజం. అప్పటికి సమానత్వమనేది ఎక్కువగా మతపరమైనదే. దేవుడి సన్నిధిని చేరడం; ముక్తి, మోక్షం పొందడం; దాంట్లో సమానత్వం సాధించడమే ఒక ప్రధానమైన అంశంగా ఉండేది. సెక్యులర్ సమానత్వం అనేది నేటి భావన. ఆ కాలంలో దైవసన్నిధిని చేరుకునే అవకాశంలో సమానత్వం మాత్రమే వారి ఆకాంక్షగా ఉండేది. ఇది వైష్ణవ మతం రూపంలో వచ్చింది. విష్ణువు మీద భక్తి ఉంటే చాలు శూద్రులైనా, స్త్రీలైనా వాళ్ళకి కూడా మోక్షం నేరుగానే వస్తుంది, జన్మ నుంచి జన్మకు కులం పెరుగుతూ పెరుగుతూ బ్రాహ్మణుడై పుట్టిన తరువాత మాత్రమే మోక్షం వస్తుందనేది ఏమీ లేదు అనేది వైష్ణవ మతం ద్వారా వచ్చింది.

ఎప్పుడైతే ఒక ఆకాంక్షగా, ఒక ఆకాంక్ష యొక్క ఫలితంగా ఈ ఆలోచన వచ్చిందో బ్రాహ్మణులు దానిని సొంతం చేసుకొన్నారు. బ్రాహ్మణ సంస్కృతిలో ఈ లక్షణం ఆది నుంచి ఉంది. సొంతం చేసుకున్నాక భగవద్గీతలో ఈ భావాన్ని, ఇతర భావాలతో కలిపి కృష్ణుడితో చెప్పించారు. వైష్ణవం ఆ రకంగా బ్రాహ్మణ మతంలో క్రమేణా భాగమైంది. చివరికి బ్రాహ్మణంలోనే ఒక శ్రీవైష్ణవ శాఖ పుట్టింది. ఆ శాఖలో పుట్టినవాడిని నేను. చిన్నప్పటి నుంచి ఈ కులం, ఈ శాఖ, ఈ సంస్కృతి వీటిని చూస్తూ పెరిగినపుడు అసలు ఇవి ఎందుకొచ్చాయి, ఎట్లా వచ్చాయి అనే ప్రశ్నలు వచ్చాయి. పెద్దవాళ్ళు ఏదో జవాబులు చెప్తారు. కాని మనకు, ముఖ్యంగా స్కూలుకు పోయి, కాలేజీకి పోయి సైన్స్, చరిత్ర చదువుకోవడం మొదలుపెట్టాక అదంతా వాస్తవంగా అనిపించదు. పైగా దాంట్లో ఉన్నటువంటి అన్యాయం మనకు అర్థం అవుతూ వస్తుంది. బ్రాహ్మణ సంస్కృతి, బ్రాహ్మణ నాగరికత వంటి అంశాలను డి.డి.కోశాంబి మార్క్సిస్టు దృక్పథంతో విశ్లేషిస్తూ రాసిన వ్యాసాలు చదివినప్పుడు, నాకు చిన్నప్పటి నుంచి పరిచయమైన నా జీవితం, దాని చారిత్రక పాత్ర ఏమిటో అర్థం అయింది. అట్లా కాలక్రమంలో మార్క్సిజంలోని మిగిలిన అంశాలను, ఒక చారిత్రక సిద్ధాంతంగా మార్క్సిజాన్ని అర్థం చేసుకోవడం నాకు సాధ్యమైంది.

## కులం, కులవ్యవస్థ, వర్ణధర్మం

కులం అనే దానికున్న ప్రత్యేక లక్షణాలు ఏమిటి అని చూసినప్పుడు conceptualగా (భావనాత్మకంగా) దాన్ని మూడు విషయాలుగా చూడాలి. కులం, కులవ్యవస్థ, వర్ణధర్మం. ఈ మూడిటి లక్షణాలు ఏమిటని విడివిడిగా ప్రశ్న వేసుకోవచ్చు. చివరికి అవి ఒకటిగానే కలిసి మనకు కనిపిస్తాయి కానీ భావనాత్మకంగా వాటిని వేరు చేసుకోవచ్చు. ఈ మూడిటికి సంబంధించి, కనీసం మొదటి రెండిటికి సంబంధించిన లక్షణాలు భారతదేశానికి మాత్రమే ప్రత్యేకం కాదు. వర్ణధర్మం ఒక్కటే ఒక అధికార మతంగా, అధికార భావజాలంగా భారతదేశం ప్రత్యేకత. మిగిలిన రెండు వేరే చోట్ల కూడా కనిపిస్తాయి. మన దగ్గర కులానికి ఉండే లక్షణాలు లాంటి లక్షణాలు కలిగిన సామాజిక బృందాలు లేదా సామాజిక వర్గాలు అవి అనేక సంస్కృతుల్లో, నాగరికతల్లో మనకు కనిపిస్తాయి. అయితే దానికి సంపూర్ణమైన, సమగ్రమైన అతిరూపం ఇచ్చింది మాత్రం భారతదేశంలోనే. అట్లానే కులవ్యవస్థకి ఉండే లక్షణాలు కూడా చాలా దేశాల చరిత్రలో మనకు కనిపిస్తాయి. దానికి కూడా మళ్ళీ సంపూర్ణమైన అతిరూపం ఇచ్చింది మాత్రం భారతదేశంలోనే.

వర్ణధర్మం అనేది పాలక భావజాలంగా ఒక్క భారతదేశంలోనే ఉంది. కులవ్యవస్థ, కులం అని తేడా ఎందుకు చెప్తున్నాను అంటే – కులవ్యవస్థ అనేది ఒక నిచ్చెన వ్యవస్థ, హెచ్చుతగ్గులతో కూడిన వ్యవస్థ, ఒకరు తక్కువ, ఒకరు ఎక్కువ, ఒకరు అంటరానివాళ్ళు, ఒకరు అంటతగ్గవాళ్ళు, ఒకరు అందరి కంటే ఉన్నతులు, ఒకరు నీచులు అనేటటువంటి హెచ్చుతగ్గుల వ్యవస్థ కులవ్యవస్థ. కులం వేరు. మనం మామూలుగా కుల కట్టడి అంటామే ఆ కట్టడికి సంబంధించిన భావన, దానికి సంబంధించిన వ్యవస్థ కులమనేది. అంటే ఒక కులంలో మనుషులందరూ వాళ్ళలో వాళ్ళు మాత్రమే పెళ్లి చేసుకుంటారు. సాధారణ పరిస్థితుల్లో వాళ్ళలో వాళ్ళకు మాత్రమే సంపర్కం ఉంటుంది. ఇతరుల ఇళ్లలో భోజనం చేయడం మీద లేదా వాళ్ళని ఇంటికి పిలవడం మీద రకరకాల ఆంక్షలు ఉంటాయి. కొన్ని కులాల ఇళ్లల్లోకి అసలు పోనే పోకూడదు. కొన్ని కులాల దగ్గర వండిన భోజనం తీసుకోకూడదు, కాని వండని భోజన పదార్థాలను తీసుకోవచ్చు. ఇట్లా ఇళ్ళల్లోకి పోవడానికి, భోజనానికి సంబంధించి మాత్రమే కాదు, ఇతర రకాల సాంఘిక సంపర్కానికి సంబంధించి కూడా మన దగ్గర రకరకాల నియమాలు ఉంటాయి. ఈ కట్టడి, అంటే ఇట్లా సమాజంలో ఒక బృందం, ఒక సమూహం ఇతర సమూహాలతో తనకు ఉండేటటువంటి సంపర్కానికి – లైంగిక సంపర్కం కావచ్చు, వివాహ సంబంధం కావచ్చు, భోజనం కావచ్చు, ఏదైనా కావచ్చు – కొన్ని నియమాలను పెట్టుకొని, కట్టడి పెట్టుకొని దాని ప్రకారం బతకడం; ఈ నియమాలను అమలు చేసేందుకు కుల పెద్దలు గానీ, కుల పంచాయితీ గానీ, కుల సంఘం గానీ ఉండటం అనేది ఆదిమ గణాలలో, తెగలలో అన్ని చోట్లా దాదాపు విశ్వవ్యాప్తంగా మనకు కనిపిస్తుంది. తెగ సమాజంలో ఈ లక్షణం సర్వత్రా కనిపిస్తుంది. కాని దీనికి చాలా అతిరూపం, తీవ్రరూపం ఇచ్చింది మాత్రం భారతదేశంలోని కులం.

మన దగ్గర ఒక్క వివాహం విషయంలోనే కాదు, ప్రతి చిన్న విషయంలోనూ కులానికి కులానికి మధ్య ప్రత్యేకతలు ఉంటాయి. ఏ చిన్న విషయంలో కట్టు దాటినా కులం ఆ మనిషిని శిక్షిస్తుంది. కులంలో ఒక భాగం మొత్తం ఒక నియమాన్ని ఉల్లంఘిస్తే వాళ్ళు వేరే శాఖగా మారిపోతారు. ఉదాహరణకు ఒక రకమైన మగ్గం ఉపయోగించడమనేది సంప్రదాయంగా ఉన్నపుడు అధునాతమైన మార్పులు వచ్చి కొందరు వేరే రకమైన మగ్గం ఉపయోగించడం మొదలుపెడితే వాళ్లు వేరే శాఖగా మారిపోయినటువంటి సందర్భాలు మన దేశంలోని నేతకులాల్లో చాలా చోట్ల జరిగాయి. కుమ్మరి, కమ్మరి వృత్తుల్లో పనిముట్లు మారినపుడు కూడా కొత్త పనిముట్లతో పని చేసేవాళ్ళు వేరే శాఖ అయిపోవడం చూశాం. అంత కచ్చితమైన కుల కట్టడి ఉంది మన

దగ్గర. బాహ్య సంపర్క నిషేధం పెట్టే సామాజిక బృందాలు ఆదిమకాలంలో అన్ని సమాజాలలోనూ మనకు కనిపిస్తాయి. గిరిజన తెగల్లో ఇప్పటికీ కనిపిస్తాయి. కాని భారతదేశంలో మాత్రమే ఇది ఇంత సంపూర్ణ రూపం ఎందుకు తీసుకుందనేది ఒక ప్రశ్న. దీని సాంఘిక, సామాజిక పర్యవసానాలు ఏమిటి, దీని వల్ల మనుషుల మధ్య వచ్చే విభజనను ఏ రకంగా పోగొట్టుకోవాలి, మనుషులు మానవులు కావాలనే ఆకాంక్ష నెరవేర్చుకోవడం ఎలా అన్నది మన ముందున్న ప్రశ్న.

## పౌర ప్రతిపత్తిలో సమానత్వం

మామూలుగా మార్క్సిస్టు పరిభాషలో మనం ఆధునిక ప్రజాస్వామ్యాన్ని బూర్జువా ప్రజాస్వామ్యం అంటాం. దాన్ని తిట్టుగా వాడటం మాత్రమే నేర్చుకున్నాం కాని చారిత్రకంగా అర్థం చేసుకోవడం ఇంకా నేర్చుకోలేదు. ఈ బూర్జువా ప్రజాస్వామ్యం మాత్రమే చరిత్రలో మొట్టమొదటిసారిగా సివిక్ ఈక్వాలిటీని, అంటే పౌర సమానత్వాన్ని అందరికీ ఇచ్చింది. అంతకు ముందు ఉన్న సమాజాలలో పౌర అసమానత్వం చాలా ఉండేది. అది యూరప్‌లో కావచ్చు, భారతదేశంలో కావచ్చు, ఎక్కడైనా కావచ్చు సాంఘిక ప్రతిపత్తి అందరికీ ఒకటిగా లేదు. సాంఘిక ప్రతిపత్తి లేదా పౌర ప్రతిపత్తి అనేది అందరికీ సమానం కాకుండా ఉండటం ఒక్క కులవ్యవస్థ లక్షణమే కాదు, దాదాపు అన్ని దేశాల్లో కూడా దీనికి సంబంధించిన లక్షణాలు కనిపిస్తాయి. అయితే మళ్ళీ తేడా ఏమిటంటే కులవ్యవస్థ దాన్ని ఒక తీవ్రరూపానికి, అతిరూపానికి తీసుకుపోతుంది. ఆధునిక బూర్జువా ప్రజాస్వామ్యంలో ఆస్తుల్లో తేడాలు ఉంటాయి, అధికారంలో తేడాలుంటాయి, కాబట్టి అవకాశాల్లోనూ తేడాలు ఉంటాయి; కాని పౌర ప్రతిపత్తి మాత్రం అందరికీ సమానంగా ఉంటుంది. మన రాజ్యాంగం ఆర్టికల్ 14 లో చట్టం ముందు అందరూ సమానమే, చట్టం అందరినీ సమానంగా చూస్తుంది అని రాశారంటే చరిత్రలో ఒక ముఖ్యమైన దానిని, పౌర ప్రతిపత్తిలోని అసమానతను తిరస్కరించారని. ఆధునిక ప్రజాతంత్ర సూత్రంగా బూర్జువా ప్రజాస్వామ్యం తీసుకొచ్చింది దానిని.

ఇతర దేశాల్లో కూడా – ఉదాహరణకు ఈజిప్ట్, చైనా, జపాన్, పశ్చిమాసియా, ఇంగ్లాండ్ లలో కూడా రకరకాల విభజనలు ఉంటాయి సమాజంలో. మన దగ్గర క్షత్రియ, బ్రాహ్మణ, వైశ్య, శూద్ర అని విభజనలు ఉన్నట్లు Patricians- Plebeians అని, nobility-commoners అని, free men-slaves అని అక్కడ కూడా విభజనలు ఉంటాయి. ఈ విభజనలు సమాన ప్రతిపత్తిని తిరస్కరిస్తాయి. సమాజాన్ని పరిపాలించే అధికార

యంత్రాంగంలో ఉద్యోగాలు చేసే హక్కు కొందరికి ఉండదు, కొంతమందికి మాత్రమే ఆ హక్కు ఉంటుంది. అలాగే కొంతమందికి ఆస్తిని వారసత్వంగా పొందే హక్కు ఉండదు, కొంతమందికి మాత్రమే ఆ హక్కు ఉంటుంది. కొంతమంది చేసుకునే వివాహానికి చట్టపరమైన గుర్తింపు ఉండదు, కొంతమందికి మాత్రమే ఆ గుర్తింపు ఉంటుంది. కొంతమందికి యుద్ధంలో పాల్గొనే హక్కు ఉండదు, కొంతమందికి మాత్రమే ఆ హక్కు ఉంటుంది. ఈ విధంగా పౌర ప్రతిపత్తి అందరికీ సమానంగా లేకపోవడం అనేది బూర్జువా పూర్వ అంటే pre-capitalist societies అన్నిట్లో కామన్ లక్షణం. బూర్జువా ప్రజాస్వామ్యంలోనే పౌర ప్రతిపత్తి అందరికీ చట్టం ప్రకారం సమానమైంది. ఆర్థిక స్థాయి వేరు ఉండొచ్చు, ఉండకపోవచ్చు. ఆర్థిక అవకాశాలు ఉండొచ్చు, ఉండకపోవచ్చు. దానికి వ్యతిరేకంగా జరిగే పోరాటాలు – అదొక వేరే అంశం. కాని సమాన పౌర ప్రతిపత్తిని తిరస్కరించడమనేది పెట్టుబడిదారీ వ్యవస్థకి పూర్వమున్న వ్యవస్థలన్నిటికీ సామాన్య లక్షణం. కులవ్యవస్థ దానికి తీవ్రరూపం, అతిరూపం. ఇంత సంపూర్ణంగా దాన్ని వ్యవస్థీకరించిన సమాజం భారతదేశంలో తప్ప ప్రపంచంలో మరెక్కడా కనిపించదు.

అంబేద్కర్ చాలా ఉదాహరణలు ఇస్తాడు. ఈజిప్టులో లేదా? అమెరికాలో లేదా? జపాన్‌లో లేదా కులవ్యవస్థ అని కొంతమంది వేరే దేశాలతో పోలుస్తూ ఉంటారు. ఇక్కడున్న రూపానికి, అక్కడున్న రూపానికి తేడా ఏమిటో చెబుతాడు అంబేద్కర్. ఉదాహరణకు రోమ్‌లో ప్లెబియన్స్ (సామాన్యులు) గా ఉన్నవాళ్ళు ఎవరైనా ఒక ప్యాట్రిసియన్ (శిష్ట వర్గం) ను పెళ్లి చేసుకుంటే ఆ వ్యక్తి ప్యాట్రిసియన్ కావచ్చు, అంటే పై స్థాయికి పోవచ్చు. అలాగే బానిసలుగా ఉన్నవాళ్ళు కష్టపడి డబ్బు సంపాదించి, యజమానికి ఆ డబ్బు కట్టేసి freemen కావచ్చు, అంటే స్వేచ్ఛ పొందవచ్చు. చైనాలో ఇంకో రకం పద్ధతి ఉంది. ఆ దేశంలో ఒక పరీక్ష పాస్ అయిన వారికి మాత్రమే అధికార యంత్రాంగంలో పని చేసే అవకాశం ఉంటుంది. వాళ్ళను మండారిన్స్ అంటారు. వాళ్లకు సమాజంలో ఒక ప్రత్యేక ప్రతిపత్తి ఉంటుంది. వాళ్లకు ఉన్న హక్కులు, అధికారాలు, అవకాశాలు వేరేవాళ్లకు ఉండవు. ఆ పరీక్ష పాస్ అయితే ఎవరైనా దాంట్లోకి పోవచ్చు. అయితే కొన్నిరకాల వృత్తులు చేసేవాళ్లకు అది వర్తించదు. మన కులవ్యవస్థలో ఉన్నట్లు అక్కడ కూడా నిషేధం పెట్టారు. కానీ అది కొద్దిమందికి మాత్రమే. మొత్తం మీద చూస్తే వారి సమాజంలో పౌర ప్రతిపత్తిలో అసమానతలనేవి మన కుల వ్యవస్థలో ఉన్నంత తీవ్ర రూపంలో ఉండవు. కానీ పౌర ప్రతిపత్తిలో సమానత్వం లేకపోవడం అనేది మాత్రం ప్రాచీన కాలంలో అన్ని చోట్లా దాదాపు సామాన్య లక్షణంగా ఉంది.

జపాన్‌లో 19వ శతాబ్దం వరకు కూడా సైనిక యోధుల కులం ఒకటి – సమురాయ్ అంటారు, ఇపుడు మనకు ఒక మోటార్ సైకిల్ ఉంది ఆ పేరుతో, అది ఉండేది. జపాన్ టెక్నాలజీ రావడంతో వాళ్ళ సంస్కృతీ, చరిత్ర ఇక మీదట మనకు మోటార్ సైకిల్, టెలివిజన్ పేర్ల రూపంలో తెలుస్తాయేమో! ఈ సైనిక యోధుల కులం వారికి జపాన్‌లో చాలా ప్రత్యేకమైన హక్కులు, అవకాశాలు ఉండేవి. వారికి వేరే కోర్టులు, వేరే చట్టాలు సైతం ఉండేవి. వాళ్ళ మీద నువ్వు కేసు వేయాలన్నా వాళ్ళు మామూలు కోర్టుకి రారు. వారికి వేరే కోర్టు ఉంది. ఆ కోర్టుకే పోవాలి. వాళ్ళు ముద్దాయిగా రావాల్సి వచ్చినా ఈజీ చైర్‌లో కూర్చోబెట్టి పోలీసులు వార్ని మోసుకొని పోవాల్సి వచ్చేదట. ఊరికే సమన్లు పంపిస్తే రారు. ఆ సమురాయ్ కులం వాళ్ళు వేరే వాళ్ళని పెళ్లి చేసుకోరు. వాళ్లలో వాళ్ళే పెళ్లి చేసుకుంటారు. అయినా కొన్ని కొన్ని పరిస్థితుల్లో ప్రభుత్వాన్ని ప్రత్యేకంగా మెప్పించి ఆ కులంలోకి ప్రవేశించే అవకాశం బయటివాళ్ళకు కొంచెం ఉంటుంది. అదే జపాన్‌లో ఒక అంటరాని కులం కూడా ఉండేది. దాదాపు ఈ శతాబ్దం ప్రారంభం వరకు కూడా ఉండేది.

ఇట్లా మనం ప్రీ క్యాపిటలిస్ట్ సొసైటీలలోకి, అంటే పెట్టుబడిదారీ పూర్వ, బూర్జువా పూర్వ వ్యవస్థల్లోకి పోతే పౌర ప్రతిపత్తి, సాంఘిక ప్రతిపత్తి అనే దాంట్లో అసమానతలు చాలానే కనిపిస్తాయి. ఆస్తిని వారసత్వంగా పొందొచ్చా, పొందకూడదా అనే హక్కు అందరికీ ఒక రకంగా ఉండదు; ఆ సమాజాన్ని పరిపాలించే అసెంబ్లీ లాంటిది ఏదైనా ఉంటే దాంట్లో సభ్యులుగా చేరవచ్చా లేదా అనే దాంట్లో అందరికీ సమానమైనటువంటి అవకాశం ఉండదు; అధికార యంత్రాంగంలో ఉద్యోగాలు చేయవచ్చునా, యుద్ధంలో పాల్గొనవచ్చునా లాంటి వాటిల్లో అందరికీ సమానమైనటువంటి అవకాశం ఉండదు. ఇటువంటి అసమాన పౌర ప్రతిపత్తి అనేది ప్రీ క్యాపిటలిస్ట్ సొసైటీలన్నిట్లోనూ కామన్‌గా ఉండే లక్షణం. కానీ కులవ్యవస్థ దీనికి అతిరూపం, తీవ్రమైన రూపం ఇస్తుంది. ఎంత తీవ్రమైన రూపం ఇస్తుందంటే, మనం బ్రాహ్మణ ధర్మశాస్త్రాలను గాని చదివితే ఏ ఒక్క చిన్న విషయాన్ని విడిచిపెట్టకుండా అన్నిట్లోనూ వాళ్ళు – బ్రాహ్మణులైతే ఇట్లా, క్షత్రియులైతే ఇట్లా, వైశ్యులు అయితే ఇట్లా, శూద్రులు అయితే ఇట్లా అనే కచ్చితమైన నియమాలు పెట్టారు. ఇది ఎంత తీవ్రంగా ఉంటుందనేదానికి చాలా ఉదాహరణలు ఉన్నాయి. బహుశా మీరు చాలా వినే ఉంటారు. చివరికి ఒక మీటింగ్‌లో ఇట్లా కలిసి కూర్చోవడాన్ని కూడా ధర్మశాస్త్రాలు అంగీకరించవని, వర్ణవ్యవస్థ ఆ విధంగా ఉండి ఉంటుందని మనం ఊహించగలం. అంతేకాదు, ఎవరు ఎక్కడ కూర్చోవాలి అనే దానికి కూడా వాళ్ళకు

నియమాలు ఉన్నాయి. బ్రాహ్మణులు కూర్చునే చోట తెల్లటి స్థంభం కట్టాలట, బ్రాహ్మణులు ఇక్కడ కూర్చుంటారు అని చెప్పడానికి అది సూచిక. క్షత్రియులు కూర్చునే చోట ఎర్రటి స్థంభం కట్టాలట, క్షత్రియులు అక్కడ కూర్చుంటారని చెప్పడానికి అది సూచిక. వైశ్యులు కూర్చునే చోట పసుపుపచ్చ స్థంభం, మన ఎన్.టి. రామారావు గారి రంగు, అది కట్టాలి. వైశ్యులు అక్కడ కూర్చుంటారు. శూద్రులు కూర్చునే చోట నల్లటి స్థంభం కట్టాలి, వాళ్ళు అక్కడ కూర్చుంటారు...ఇలా.

## ఆఖరికి నమస్కారాలలో కూడా తేడాలు

పలకరించేటప్పుడు మనం మామూలుగా బాగున్నావా అంటాం లేదా ఆరోగ్యం బాగుందా అంటాం. కాని ధర్మశాస్త్రాల ప్రకారం 'నీకు ఒంట్లో బాగుందా' అనే పలకరింపుకు కూడా కొన్ని నియమాలు ఉన్నాయి. దానికి ఏ సంస్కృత పదం వాడతాం అనేది అవతల వ్యక్తి వర్ణాన్ని బట్టి ఉండాలంట. శూద్రుణ్ణి మాత్రమే ఆరోగ్యం బాగుందా అనాలట. ఆరోగ్యం అనేది సంస్కృతంలో ఆరోగ్యాన్ని సూచించే అన్ని మాటల్లోకి నీచమైన మాట కింద లెక్క. ఈ రోజు మనకది చాలా సంస్కృత పదంగా అనిపిస్తోంది. ఆరోగ్యం బాగుందా అని శూద్రుణ్ణి మాత్రమే అడగాలి. వైశ్యుడికి ఇంకొక మాట, క్షత్రియుడికి ఇంకొక మాట, బ్రాహ్మణుడికి అన్నిటికంటే ఉత్కృష్టమైన మాట వాడాలి. అలాగే ఎవరైనా కలిసినపుడు ఇవాళ అందరం కూడా షేక్ హ్యాండ్ ఇస్తాం, లేకపోతే నమస్తే అంటాం. కానీ అప్పుడు అట్లా కాదు. అవతలి వాడి కులాన్ని బట్టే కాదు, ఇవతలి వాడి కులాన్ని బట్టి కూడా వాళ్ళకు నమస్కారం హృదయం దగ్గర చేతులు జోడించి పెడతామా, నడుము దగ్గర చేతులు జోడించి పెడతామా లేదా వంగి కాళ్ళు పట్టుకుని పెడతామా అని ఉండేది. అంటే వర్ణాన్ని బట్టి నమస్కారం కూడా మారుతుంది. ప్రతి విషయంలోనూ, అది క్రిమినల్ లా గానీ, సివిల్ లా గానీ, ఏ రకమైనటువంటి సామాజిక వ్యవహారంలో గానీ – పౌర ప్రతిపత్తి, సాంఘిక ప్రతిపత్తి అన్నాం కదా – ఈ ప్రతిపత్తిలో అసమానతను సంపూర్ణంగా వ్యవస్థీకరించింది కులవ్యవస్థ.

ఆధునిక కాలంలో బ్రిటిష్ వాళ్ళు వచ్చిన తరువాత వాళ్లకి కులం అనేది మొదట్లో ఒక క్యూరియాసిటీగా ఉండేది – ఇదేదో విచిత్రంగా ఉంది, ఎక్కడా లేనిది అని. దీని గురించి కొంచెం కొంచెం సమాచారం సేకరించడం మొదలుపెట్టారు. పరిపాలించేటప్పుడు వాళ్ళకు తమ అలవాట్లు, ఆచారాల ప్రకారం నిర్ణయాలు తీసుకుంటుంటే కొన్ని ఇబ్బందులు వచ్చినయ్యి. తుపాకి తూటాలకు ఆవు కొవ్వుతో కలిపినటువంటి దాన్ని పూసారు కాబట్టే

సిపాయి తిరుగుబాటు వచ్చిందని చెప్తారు కదా. అటువంటి కొన్ని సంఘటనలు జరిగినప్పుడు కూడా ఈ ఆచారాలు ఏమిటి, కులం ఏమిటి, వాటి కట్టడి ఏమిటి అని వాళ్ళు క్రమంగా వాటి గురించి తెలుసుకోవడం ప్రారంభించారు. ఆ తర్వాత వాళ్ళు తీసుకొచ్చిన ఆధునిక ప్రజాతంత్ర భావాల ఫలితంగా ఇక్కడ చదువుకున్నవాళ్ళు చాలామంది కూడా కుల కట్టుబాట్ల గురించి ప్రశ్నించడం మొదలుపెట్టారు. కులవ్యవస్థలో ఉన్న కొన్ని దురాచారాల గురించి మొదట్లో ప్రధానంగా అగ్రవర్ణాలకు చెందినటువంటి మేధావులే స్పందించారు. రజస్వల కాకముందే అమ్మాయిలకు పెళ్లి చెయ్యాలని, రజస్వల అయ్యే దాకా అమ్మాయి పెళ్లి ఆపితే ఆ కుటుంబం నాశనం అయిపోతుందని, వితంతువు పునర్వివాహం చేసుకోవడం పాపమని – ఇలాంటి భావాలకు వ్యతిరేకంగా వారిలో ఆలోచనలు వచ్చినప్పుడు అసలు ధర్మశాస్త్రాల్లో ఏముంది అని వారు వెతకడం మొదలుపెట్టారు. సనాతన బ్రాహ్మణులేమో ఇదంతా ధర్మశాస్త్రాల్లో ఉంది అని చెపుతూ వస్తున్నారు, అందరు కూడా పాటిస్తూ వస్తున్నారు. చదువుకున్న బ్రాహ్మణులు, కాయస్తులు ఇప్పుడు ధర్మశాస్త్రాలు తీసి ఇదంతా వాస్తవంగా ఉందా లేదా అని చూడటం మొదలుపెట్టారు. చరిత్రలో మార్పులు వస్తూ ఉంటాయి కాబట్టి ఈ నియమాలు లేని చారిత్రక దశ ఒకటి ఎక్కడో వారికి దొరుకుతుంది. అక్కడున్న ఒక ఉపనిషత్తునో, ఒక వేదాన్నో పట్టుకుంటారు, పట్టుకొని సంస్కరణకు దానిని వాడుకునే ప్రయత్నం చేస్తారు.

ఇట్లా కులవ్యవస్థ గురించి కొంచెం ఆలోచన – అది ఎక్కడ పుట్టింది, ఎట్లా వచ్చింది, దాంట్లో మార్పులేమొచ్చాయి అనే ఆలోచన వచ్చింది. మొత్తంగానే ఈ కులవ్యవస్థ అనేది సమాజంలో మెజార్టీ ప్రజలకు ఎంతగా ద్రోహం చేసింది అనే ఆలోచన రావడంతో, దళిత కులాల్లో పుట్టినటువంటి వాళ్ళు – స్కాలర్స్, ప్రధానంగా అంబేడ్కర్, మొత్తంగా ఈ ధర్మశాస్త్రాలను, వేదాలను పరిశీలించి ఈ కులవ్యవస్థ మూలమేది, ఎక్కడి నుంచి వచ్చింది అని పరిశీలన చేయడం మొదలుపెట్టారు. తర్వాత కాలంలో చరిత్రకారులు ప్రొఫెషనల్ హిస్టారియన్స్‌గా వాళ్లకున్న భావాలను బట్టి పరిశోధనలు చేస్తున్నారు.

## ఇంత కులకట్టడి ఇంకెక్కడా చూడం

కులం ఒకటి, కులవ్యవస్థ ఒకటి, వర్ణధర్మం ఒకటి అని చెప్పుకున్నాం కదా! కులం అనేది బాహ్య సంపర్క నిషేధం మీద ప్రధానంగా ఆధారపడ్డది. అంటే బాహ్య వివాహాలు పూర్తిగా నిషిద్ధం. మిగిలిన విషయాలు కొంతవరకు నిషిద్ధం. ఈ నిషేధం ఎంత దూరం పోతుంది అంటే, ఒక కులం వాళ్ళు నదికి ఒక పక్క మాత్రమే ఉంటే, వాళ్ళు ఆ నదికి ఆ

పక్క మాత్రమే ఉండాలనేది ఆచారమైపోతుంది. ఆ కులంవాళ్ళు ఎవరైనా కొంతమంది నది దాటి అవతలికి పోతే, వాళ్ళు వేరే శాఖ అయిపోవాల్సిందే. ఆ రోజు నుండి ఆ కులంలో భాగం కారు వాళ్ళు. వాళ్ళను వెలివేస్తారు. ఆ కులంలో అది వేరే శాఖ అయిపోతుంది. ఆ శాఖకు నదిని దాటినవాళ్ళు అని అర్థం వచ్చే పేరు కూడా వస్తుంది. కులం కట్టడిని ఇంతగా, ఇంత దూరం తీసుకుపోయినటువంటి సమాజం వేరే ఏదీ లేదు. ఎందుకు జరిగింది ఇట్లా అని చూడాలి మనం.

ఇప్పుడు కులవ్యవస్థ గురించి మాట్లాడుకుందాం. తెగల మధ్య కూడా కులం కట్టడి ఉంటుంది. గోండులు ఉంటారు, పరధానులు ఉంటారు, కోయలు ఉంటారు, తెలంగాణలో అయితే కోలాములు ఉంటారు. వాళ్ళు ఒకరిని ఒకరు పెళ్ళి చేసుకోరు. సాధారణ సందర్భాల్లో ఒక తెగలో మతపరమైనటువంటి కర్మకాండ జరిగేటప్పుడు వేరేవాళ్ళు దగ్గరికి పోకూడదు. ఒక రకమైన అశుభ్రతగా భావిస్తారు దాన్ని. మైల పద్ద భావన ఉంటుంది. ఇవన్నీ ఉన్నప్పటికీ వాళ్ళలో హెచ్చుతగ్గులు ఉండవు. ఏ భాషా ప్రజలైనా, ఉదాహరణకు తెలుగు వాళ్ళనుకోండి, మామూలుగా అనుకుంటారు – మేము తెలుగువాళ్ళం, తమిళుల కంటే మేమే గొప్పవాళ్ళం అని. ఆ విధంగా అనుకోవడం గురించి కాదు నేను చెప్పేది. ఒక వ్యవస్థగానే గోండులు కోయలు కంటే ఎక్కువ, లేకపోతే కోయలు గోండుల కంటే ఎక్కువ, పరధానులు గోండుల కంటే ఎక్కువ, లేదా కోలాములు కంటే గోండుల ఎక్కువ, ఈ రకమైనటువంటి నిచ్చెన వ్యవస్థ ఉండదు ఆదివాసీ తెగలలో. కులం కట్టడిని నిచ్చెన వ్యవస్థగా మార్చి కులవ్యవస్థగా తయారుచేసి, అందులోకి కట్టుబాట్లు, అసమానత అనే వాటిని చేర్చి, జీవితానికి సంబంధించిన అన్ని విషయాల్లో, అన్ని సాంఘిక సామాజిక విషయాల్లో అంతరాలను వ్యవస్థీకృతం చేశారు మన దగ్గర. కులవ్యవస్థ ఎందుకు ఇంత తీవ్రమైన రూపం తీసుకుంది అనేది మన ముందున్న ఇంకొక ప్రశ్న.

## అసమానతలను సిద్ధాంతీకరించిన ఘనత హైందవానిదే

మూడవ ప్రశ్న వర్ణధర్మం గురించినది. వర్ణధర్మం ప్రత్యేకత ఏమిటంటే – కులం కట్టడి లాంటి కట్టడి, పౌర విషయంలో ఏదో ఒక రూపంలో అసమానత, అసమాన ప్రతిపత్తి దాదాపు అన్ని దేశాల్లో ఉన్నా, పాలక భావజాలం, పాలక మతం దాన్ని సిద్ధాంతీకరించింది మాత్రం ఒక్క భారతదేశంలోనే. జపాన్ సంగతి చెప్పాను, సమురాయ్ అనేటటువంటి ఒక సైనిక యోధుల కులం ఉండేదని. జపాన్‌లో అప్పటికి పాలకమతం బౌద్ధ మతమే. కాని బౌద్ధ మతం దాన్ని సిద్ధాంతీకరించలేదు. అయినా ఆ విధానంతో ఎట్లా సర్దుబాటు చేసుకుంది, ఎట్లా రాజీ పడింది అనేది వేరే సంగతి. కాని బౌద్ధ మతం

మాత్రం దాన్ని సిద్ధాంతీకరించలేదు. అట్లాగే ఇరాన్. నిజానికి ఇరాన్ అనే మాట ఆర్యాణాం అనే మాట నుంచి వచ్చింది అంటారు. ఆర్యులు వస్తూ వస్తూ చాలాకాలం ఇరాన్‌లో ఉండిపోయారని, ఆ తర్వాత కొంతమంది అక్కడే ఉండిపోయి, కొంతమంది భారతదేశానికి వచ్చారని చెపుతారు. ప్రాచీన సంస్కృతిలో వైదిక బ్రాహ్మణ సంస్కృతికి, జొరాస్ట్రియన్ మత సంస్కృతికి చాలా పోలికలు ఉంటాయి. మాటల్లో కూడా పోలికలు ఉంటాయి. శూద్ర అనే మాట ఒకటి అక్కడా ఉంది, దాసులు అనే మాట పాత పర్షియన్ భాషలోనూ ఉంది. కాని అక్కడ కూడా జొరాస్ట్రియన్ మతం దాన్ని సిద్ధాంతీకరించలేదు. తర్వాత వచ్చిన ఇస్లాం అయితే అసలు సిద్ధాంతీకరించలేదు. సాంఘిక జీవితంలో పెట్టుబడిదారీ పూర్వ సమాజాల్లో ఉండేటటువంటి అసమాన పౌర ప్రతిపత్తిని ఏ పాలక మతమూ ఎప్పుడూ సిద్ధాంతీకరించలేదు, ఒక్క హైందవం తప్ప. క్రైస్తవ మతం సూత్రరీత్యా దాన్ని వ్యతిరేకించింది కానీ రాజీపడ్డది. ఎందుకు రాజీపడ్డది, ఎట్లా రాజీపడ్డది అనేది ఆయా దేశాల చరిత్రకి సంబంధించిన విషయం. మనకది ఇవాళ ప్రస్తుతం కాదు. దాన్ని సిద్ధాంతీకరించి ఇది దేవుడి ఆజ్ఞ, దేవుడే ఇట్లా సృష్టించాడు అన్నది మాత్రం ఒక్క భారతదేశంలోనే. అది వర్ణధర్మం రూపంలో జరిగింది. ఎందుకు జరిగింది?

ఈ మూడూ ఎలా జరిగాయి అనే ప్రశ్నలకు సమగ్రమైన సమాధానం చెప్పగలిగినప్పుడే కులాన్ని గురించి మనకు సమగ్ర అవగాహన వచ్చింది అని అనుకోవాల్సి ఉంటుంది. ఆ సమగ్రత ఇప్పటిదాకా ఎవరికీ వచ్చిందని నేను అనుకోను. అయితే సమగ్రమైన సమాధానాన్ని వెతికే ప్రయత్నం మనం ఏ ప్రాతిపదిక మీద చేయాలనేది మాత్రం కొంత చెప్పే ప్రయత్నం చేస్తాను.

మన దగ్గర కులంపై చర్చ ఎక్కువగా మార్క్సిజం, మార్క్సిజం ప్రతిపాదించినటువంటి చారిత్రక భౌతికవాదం ప్రాతిపదిక మీద జరిగింది. ఆ ప్రాతిపదిక మీద కులాన్ని పూర్తిగా అర్థం చేసుకోగలుగుతామా లేదా, అది సరిపోతుందా సరిపోదా అనే రూపంలో జరిగింది. చారిత్రక భౌతికవాదాన్ని గాని ఆమోదిస్తే కులమనేది ఉపరితల విషయం కాబట్టి దాన్ని పట్టించుకోవడం కరెక్ట్ కాదు, సంస్కృతికి సంబంధించిన ఎన్నో విషయాలను పట్టించుకున్నట్టుగా మాత్రమే దానినీ పట్టించుకుంటాం తప్ప అంతకంటే కాదు అని ఒక అభిప్రాయం ఉంది. అలాగే చారిత్రక భౌతికవాదం దృష్టిలో కులం పునాదిలో భాగం కాకపోతే చారిత్రక భౌతికవాదమే తప్పు, అప్పుడు మార్క్సిజం మూలసూత్రాలే భారతదేశానికి వర్తించవు అనే సిద్ధాంతం మరొకటి ఉంది. లేదు, చారిత్రక భౌతికవాదం చెప్పే వర్గమే

భారతదేశంలో కులం కాబట్టి, వర్గం అనే మాట వదిలిపెట్టి కులం అనే మాట ఉపయోగిస్తేనే భారతదేశానికి చారిత్రక భౌతికవాదం అన్వయింపు సక్రమంగా జరుగుతుందని ఇంకొక అభిప్రాయం ఉంది. ఇట్లా రకరకాల అభిప్రాయాలున్నాయి.

## చారిత్రిక భౌతికవాదం ఒక్కటే సరిపోతుందా!

చారిత్రక భౌతికవాదంలో ప్రధానమైన అంశం ఏమిటీ అంటే చరిత్రకు అతీతంగా దేన్నీ పరిశీలించకూడదు, చారిత్రక స్రవంతిలో భాగంగానే అన్నిటిని కూడా పరిశీలించాలన్నది చారిత్రక భౌతికవాదంలో చాలా కీలకమైన విషయం. It is historical materialism, ఒట్టి మెటీరియలిజం కాదు. మెటీరియలిజం అంటే ప్రాకృతిక వాస్తవాలు, సామాజిక వాస్తవాలు, కళ్ళకు కనిపించే వాస్తవాలను మాత్రమే తీసుకొని విశ్లేషించాలి తప్ప ఏవో ఊహాత్మకంగా ఉన్న విషయాలను కాదు. హిస్టారికల్ అనడంలో ఉద్దేశ్యం ఏమిటీ అంటే మనకు కనిపించే ఈ వాస్తవాలన్నీ కూడా ఒక చారిత్రక స్రవంతిలో భాగం, ఆ చారిత్రక స్రవంతిలో భాగంగానే విషయాలను అర్థం చేసుకోవాలి అనేది చారిత్రక భౌతికవాదంలో చాలా కీలకమైన విషయం. చారిత్రక భౌతికవాదంలోని వేరే విషయాలు ఏ మేరకు పరిశీలనలో నిలిచినా, నిలవకపోయినా ఇద్దైతే చాలా విలువైన విషయం, ఎప్పటికైనా ఆమోదించవలసిన విషయం. కాబట్టి చారిత్రక క్రమంలో కులవ్యవస్థ, వర్ణధర్మం అనేవి ఎక్కడ పుట్టాయి, ఎట్లా పుట్టాయి, ఎట్లా మారాయి అని గుర్తించడం, ఏ కారణంగా మారాయి, ఇవాళ్టి దాని రూపం ఏమిటి, రేపు ఏ రకంగా దానిని మార్చుకోగలుగుతాం అనే ప్రశ్నలు వేసుకోవాలి. వేసుకున్నప్పుడు సహజంగా చారిత్రక భౌతికవాదంలో కీలకమైనటువంటి అంశం ఏమిటి అంటే ఉత్పత్తి వ్యవస్థ. ఉత్పత్తి వ్యవస్థే చరిత్రను నిర్ణయిస్తుంది, సమాజాన్ని నిర్ణయిస్తుందనేది.

ఉత్పత్తి వ్యవస్థ అంటే ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు. ఇవి రెండూ కలిసిందే ఉత్పత్తి వ్యవస్థ. ఉత్పత్తి శక్తులు అంటే భౌతిక ఉత్పత్తి సాధనాలు. అది దున్నుకునే భూమి కావచ్చు, దున్నే నాగలి కావచ్చు, ఎడ్లు కావచ్చు, ఒక ఫ్యాక్టరీ కావచ్చు, మెషీన్లు కావచ్చు. ఇవే కాకుండా పని చేసే శ్రామికుల సాంకేతిక నైపుణ్యం కూడా ఉత్పత్తి సాధనాల్లో భాగమే. సాధారణంగా ఇది మర్చిపోతూ ఉంటారు కాబట్టి చెప్పవల్సి వస్తున్నది. కార్మికుల సాంకేతిక సామర్థ్యంతో నిమిత్తం లేకుండా ఏ ఫ్యాక్టరీ నడవదు. కార్మికులకు సాంకేతిక సామర్థ్యం తగినంతగా ఉంటేనే ఫ్యాక్టరీ నడుస్తుంది. కాబట్టి ఉత్పత్తి శక్తుల్లో కార్మిక వర్గం

సాంకేతిక జ్ఞానం, నైపుణ్యం, సామర్థ్యం ఇవి కూడా భాగమే. ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలతో కూడిన ఉత్పత్తి వ్యవస్థే సమాజానికి పునాది, ఇదే మొత్తం సమాజాన్ని నిర్ణయిస్తుంది. ఈ వ్యవస్థలో మౌలికమైన వైరుధ్యాలు ముందుకొచ్చి మార్పు జరిగినప్పుడు సమాజం కూడా మారుతుంది. ఆ రకంగా చరిత్ర ముందుకి పోతుంది అనేదే చారిత్రక భౌతికవాద సిద్ధాంతం.

అయితే ఇది సరిపోతుందా? ఉత్పత్తి వ్యవస్థ మొత్తంగా సమాజాన్ని నిర్ణయిస్తుంది అని నిరూపించడం సాధ్యమేనా? ఉత్పత్తి వ్యవస్థ స్వభావాన్ని పూర్తిగా అర్థం చేసుకుంటే, దాంట్లో వచ్చే మార్పులను పూర్తిగా అర్థం చేసుకుంటే చరిత్ర పూర్తిగా అర్థం అయిపోతుందా అనేది ఒక ప్రశ్న. నేను ఆ ప్రశ్నలోకి ఇప్పుడు పోదల్చుకోలేదు. ఎందుకు అంటే అది మార్క్సిజంలో లోపాలు ఉన్నాయా లేవా అనేదానికి సంబంధించినది. అది వేరే ప్రశ్న. కానీ ఒకటి మాత్రం వాస్తవం. ఉత్పత్తి వ్యవస్థ అనేది సమాజంలో నిర్ణయాత్మక పాత్ర నిర్వహిస్తుందో లేదో గానీ కీలక పాత్ర అయితే నిర్వహిస్తుంది. ఉత్పత్తి వ్యవస్థని అర్థం చేసుకుంటే, ఉత్పత్తి వ్యవస్థలో ఉన్న వైరుధ్యాలను, మార్పులను అర్థం చేసుకుంటే మొత్తం చరిత్ర అర్థం అయిపోతుందో లేదో కానీ ఉత్పత్తి వ్యవస్థను విశ్లేషించకుండా, దాన్ని పట్టించుకోకుండా మాత్రం మనకి సమాజంలో ఏమీ అర్థం కాదు. మిగిలిన విషయాలు అర్థం చేసుకోవడం సాధ్యం కాదు, చరిత్ర అర్థం కాదు. దాని కీలకమైన స్థానాన్ని అయితే గుర్తిద్దాము. నిర్ణాయకం అవునా కాదా అన్నది మనం మాట్లాడే క్రమంలో నిర్ణయించు కోవచ్చు. దాని వల్ల కులాన్ని అర్థం చేసుకోవడానికి దోహదపడే ప్రశ్నలు మనకు కొన్ని వస్తాయి. అందుకే కీలకమైన విషయంగా గుర్తించి, ఏ విషయాన్ని అర్థం చేసుకోవాలన్నా సరే ఉత్పత్తి వ్యవస్థ మీద దృష్టి పెడదాం. ఉత్పత్తి వ్యవస్థ ఏ రకంగా ఉంది? గతంలో ఏ రకంగా ఉండింది? ఏ క్రమంలో అది ఈ స్థితికి చేరుకుంది? దీని గర్భంలో భవిష్యత్తు సూచికలుగా ఏ మార్పులు కనిపిస్తాయి అనేది చూద్దాం. చూస్తే అంతా అర్థం అయిపోతుందా లేదా అనేది వేరే ప్రశ్న. కాని చూస్తే తప్ప మిగిలిన విషయాలు అర్థం కావు అనేది నా అభిప్రాయం. ఆ మేరకు మార్క్సిజాన్ని రుజువు చేయడం సాధ్యమే. కేవలం ఉపన్యాసాల ద్వారా మార్క్సిజం అజేయం, అజేయం అంటే చాలదు, అది రుజువు చేయడం అవదు. చారిత్రక పరిశోధన ద్వారానే దాన్ని రుజువు చేయడం సాధ్యమవుతుందని నేను అనుకుంటున్నా.

## ఉత్పత్తి సంబంధాలలో మరెన్నో చేర్చాలి

తరువాత వచ్చే ప్రశ్న ఉత్పత్తి సంబంధాలు అంటే ఏమిటని. సాధారణంగా చాలామంది మార్క్సిస్టులు ఉత్పత్తి సంబంధాలు అంటే ఆస్తి, యాజమాన్యం సంబంధాలు అంటారు. సమాజంలో ఉండే ఉత్పత్తి సాధనాలు ఏమిటో చూశాం. భూమి కావచ్చు, ఫ్యాక్టరీ కావచ్చు, క్వారీ కావచ్చు, ఇంకోటి కావచ్చు, పనిముట్లు కావచ్చు, లేబర్ కావచ్చు, శ్రమశక్తి కావచ్చు. ఇవన్నీ ఉత్పత్తి సాధనాలు. అయితే వీటి యాజమాన్యం సమాజంలో ఏ రకంగా ఉంది, వాటి మీద ఎవరికి యాజమాన్య హక్కులు ఉన్నాయి, ఎవరికి లేవు?; ఎవరిది సొంత ఆస్తి, ఎవరిది సొంత ఆస్తి కాదు?; ఒకవేళ సొంత ఆస్తి లేకపోతే, ఏదైనా ఒక సమిష్టి ఆస్తి రూపంలో ఉంటే, అది ఏ రూపంలో ఉంది? ఇత్యాది విషయాలు పరిశీలించాలి. ఉత్పత్తి సంబంధాల్లో యాజమాన్య సంబంధాలు కీలకం. *(ఇక్కడ కొంత భాగం రికార్డు కాలేదు.)* అన్ని రకాల సాంఘిక సంబంధాలు కూడా ఉత్పత్తి సంబంధాల్లో భాగమే. పెట్టుబడిదారీ వ్యవస్థ గురించి మార్క్స్ మనకు సింపుల్‌గా చెప్పాడు – ఒక పెట్టుబడిదారీ వర్గం ఉంటుంది, మొత్తం ఉత్పత్తి సాధనాలన్నీ దాని చేతుల్లో ఉంటాయి. అవి ఫ్యాక్టరీలు గానీ, క్వారీలు గానీ, పొలాలు గానీ. అది పెట్టుబడిదారీ రైతాంగం కావచ్చు, పెట్టుబడిదారీ పారిశ్రామికవేత్తలు కావచ్చు, పెట్టుబడిదారీ కాంట్రాక్టర్లు కావచ్చు, వాళ్ళ చేతుల్లో మొత్తం ఉత్పత్తి సాధనాలు ఉంటాయి; మరోవైపు ఏ ఉత్పత్తి సాధనాల మీదా యాజమాన్యం లేనటువంటి కార్మికులు ఉంటారు. శ్రమశక్తి అమ్ముకుంటే తప్ప వీళ్ళ జీవితం గడవదు. దాన్ని ఆసరా చేసుకొని వాళ్ళ దగ్గర శ్రమశక్తిని కొనుక్కొని, విలువతో పాటు అదనపు విలువను కూడా ఉత్పత్తి చేయించుకొని పెట్టుబడిదారులు లాభాలు సంపాదించుకుంటున్నారు అని. ఇక్కడ ఉత్పత్తి సాధనాల మీద యాజమాన్యం ఎవరికుంది, ఉత్పత్తి సాధనాల మీద యాజమాన్యం ఏమీ లేక శ్రమశక్తి అమ్ముకుంటే తప్ప బ్రతుకు గడవని స్థితి ఎవరికుంది అనేది అర్థం చేసుకుంటే సరిపోతుంది పెట్టుబడిదారీ వ్యవస్థను వివరించడానికి.

కాని పెట్టుబడిదారీ పూర్వ సమాజాలలో ఏ వ్యవస్థను కూడా కేవలం యాజమాన్య సంబంధాల ద్వారా వివరించడం సాధ్యం కాదు. మార్క్స్ ఆ ప్రయత్నం చేయలేదు. చేసున్నా సరే, ఆయన కూడా పూర్తిగా సఫలం అయ్యేవాడు కాదు. కొంత చేసాడు. కాని పూర్తిగా సఫలం అవ్వటం సాధ్యం కాదు. ఎందుకంటే పెట్టుబడిదారీ పూర్వ సమాజాలలో కేవలం ఆస్తి యాజమాన్య సంబంధాలు ఒక్కటే ఉత్పత్తి క్రియను నిర్ణయించవు. అనేక

ఇతర సంబంధాలు కూడా ఉత్పత్తి క్రియను నిర్ణయిస్తాయి. ఇవాళ అమెరికాను ఒక ఉదాహరణగా చూస్తే – చాలా కాలం పాటు అమెరికాలో బానిసత్వం ఉండేది. ఈ బానిసత్వమనేది కేవలం 'నేను కొంతమందిని బానిసలుగా పెట్టుకుంటాను, వాళ్ళతో శ్రమ చేయించుకుంటాను' అనే పద్ధతిలో సాగలేదు. ఉత్పత్తి రంగంలో దానికి ఒక కీలకమైన పాత్ర ఉంది. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోని దక్షిణ రాష్ట్రాల్లో ఒకప్పుడు పత్తిపంట విస్తారంగా వేసేవాళ్ళు. ప్రపంచంలోనే పత్తిని విస్తారంగా పండించి ఎగుమతి చేసే దేశంగా అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఆ రోజులలో బలపడటానికి ఆఫ్రికా నుండి చాలా చవగ్గా దిగుమతి చేసుకున్న నల్లజాతి బానిసలే కారణం. బానిసత్వం అర్థమేంటంటే మామూలుగా అయితే కార్మికుడి యొక్క శ్రమశక్తి మాత్రమే యజమాని ఆస్తి, బానిస అలా కాదు. బానిస శరీరంతో పాటు ఆ మనిషి మొత్తం యజమాని యొక్క ఆస్తి. అట్లా బానిసలందరూ యజమాని యొక్క ఆస్తిగా అతని వద్ద ఉండి, చాలా చవగ్గా, ఇంత గంజి పోస్తే పని చేస్తూ ఉంటే వారి శ్రమ అమెరికా ఆర్థిక వ్యవస్థలో కీలకమైన పాత్ర నిర్వహించింది. తెల్లవాళ్లు, నల్లవాళ్ళు అని అప్పుడేర్పడిన ఆ జాతి వివక్ష ఒక ఉత్పత్తి సంబంధం అయ్యింది. అది కేవలం ఉపరితలానికి చెందిన జాతి సంబంధం కాదు. ఉత్పత్తి ఏ రకంగా నిర్వహించబడుతోంది అనే దాంట్లో ఆ జాతి వివక్షకు, ఆ జాతుల మధ్య సంబంధానికి కీలకమైన స్థానం ఉండింది.

మనం abstract గా ఊహించుకునే పెట్టుబడిదారీ నమూనాలో తప్ప, అంతకు పూర్వం ఉన్నటువంటి అన్ని సమాజాల్లో ఆర్థిక సంబంధాలు మాత్రమే కాక అనేక ఆర్థికేతర సంబంధాలు కూడా ఉత్పత్తి సంబంధాలుగా ఉండేవి. ప్రపంచ చరిత్రలో మొట్టమొదటి శ్రమ విభజన పురుషులకు, స్త్రీలకు మధ్య జరిగిన శ్రమ విభజన. ఫెమినిస్ట్ చరిత్రకారులు కొంతమంది వాటి వివరాలు చెప్తున్నారు. పురుషులు ఎప్పుడైతే పాత రాతియుగం దాటి కొత్త రాతియుగంలోకి ప్రవేశించి రాళ్ళను ఆయుధాలుగా మార్చగలిగారో, రాతి ఆయుధాలు సంపాదించుకున్నారో, ఆ తరువాత రకరకాల లోహాలు కనుక్కొని ఆయుధాలు సంపాదించుకున్నారో ఆ ఆయుధాల సహాయంతో వాళ్ళు స్త్రీలను లోబరుచుకుని వారి చేత కొన్ని రకాల పనులు చేయించారు. మిగిలిన రకాల పనులు – ఎక్కువగా హోదాను ఇచ్చేవి, అధికారాన్ని ఇచ్చేవి, ఆ రకమైన పనులు మగవాళ్ళు చేసేవారు. మగవాళ్ళు పనులు చేయలేదని కాదు, ఆ రకమైన పనులు ఎక్కువ చేసేవాళ్ళు. ఆహార సేకరణ, చిన్న చిన్న వ్యవసాయ పనులు, పశుపోషణ మొదలైన వాటిని క్రమంగా ఆడవాళ్ళకు

కేటాయించారు. మరి ఆ శ్రమ విభజనలో స్త్రీ పురుష సంబంధం ఒక ఉత్పత్తి సంబంధమే. అప్పటి సమాజం చేసేటటువంటి ఉత్పత్తిలో వేట ఒకటయితే, మిగిలినవి ఆహార సేకరణ, పశుపోషణ, చిన్నరకం వ్యవసాయమే కదా! దీంట్లో వేటను మగవాళ్ళు తమకు కేటాయించుకొని – ఒక ఉదాహరణగా చెబుతున్నా, కచ్చితంగా ఇట్లానే జరిగిందా అన్ని దేశాలలో అంటే చెప్పలేం, రకరకాల వాదాలు ఉంటాయి, అది వేరే సంగతి – స్త్రీల చేత మిగిలిన పనులు చేయించారంటే అర్థమేమిటి? ఆ సమాజంలో స్త్రీ పురుష సంబంధం, పురుషాధిక్యత అనేది ఒక ఉత్పత్తి సంబంధంగా మారిందని. అప్పుడు అది ఉపరితలం విషయం ఎట్లా అవుతుంది?

ఉత్పత్తి సంబంధాలనేవి కేవలం ఆర్థిక సంబంధాలు మాత్రమే కానవసరం లేదు, యాజమాన్య సంబంధాలు మాత్రమే కానవసరం లేదు. అందులో రకరకాల ఆర్థికేతర సంబంధాలు కూడా ఉండొచ్చు అనేది పెట్టుబడిదారీ పూర్వ సామాజిక వ్యవస్థలన్నిటిలోను వాస్తవం. యాజమాన్య సంబంధం మాత్రమే ఉత్పత్తి సంబంధం అని మార్క్స్ అన్నది నిజమే. మార్క్స్ రచనల్లో దానికి ఆధారం కూడా ఉంది. అయితే ఆయన చెప్పే మాటలన్నిటికి వేదప్రామాణికత వస్తుందని మార్క్స్ ఎప్పుడూ ఊహించలేదు. ఆయన ఒక పరిశోధకుడిగా తనకు అప్పటికి వాస్తవం అని తోచింది రాసుకుంటూ పోయాడు. తరువాత ఏమైపోయిందంటే ఒక వాక్యం తీసుకొని మార్క్స్ చెప్పాడు కాబట్టి ఇదే పరమ సత్యం అని మాట్లాడటం మొదలయ్యింది. అట్లా అవుతుందని తెలిస్తే ఆయన ఇంకొంచెం జాగ్రత్తగా రాసి ఉండేవాడని నేను అనుకొంటాను. ఆయన రకరకాల విషయాలు రాసాడు. తరువాత కాలంలో ఆయన వాక్యాలకు వేదప్రామాణికతను ఇవ్వటమే కాకుండా, మరి కొంతమందిని కూడా కలిపి పూర్వకాలపు ఋషుల గురించి చెప్పినట్లుగా వాళ్ళు చెప్పింది సత్యం అనే వాళ్ళు తయారయ్యారు. క్రమంగా మార్క్సిస్టు చరిత్రలో ఉత్పత్తి సంబంధం అంటే యాజమాన్య సంబంధమే అయింది. అదే ప్రధానమైనది. మిగిలినవి ఏవైనా ఉంటే కూడా అవి అప్రధానమైనవి అనే ఒక అభిప్రాయం వచ్చేసింది.

సోవియట్ రష్యాలోని టెక్స్ట్ పుస్తకాల్లో, వాళ్ళ డయలెక్టికల్ అండ్ హిస్టారికల్ మెటీరియలిజం (Dialectical and Historical materialism) పుస్తకాల్లో కూడా దీన్ని అలాగే రాసేసారు. దానితో అది మొత్తం కమ్యూనిస్టు సంప్రదాయంలో భాగమైపోయింది. కానీ వాస్తవంగా చరిత్రను పరిశీలిస్తే ఆర్థికేతర, యాజమాన్యేతర అనేక సంబంధాలు కూడా ఉత్పత్తి సంబంధాలు అవుతాయి. సమాజంలో ఉత్పత్తి ఏ రకంగా జరుగుతుంది,

ఉత్పత్తి వ్యవస్థ ఏ రకంగా నడుస్తుంది అనే దాన్ని అవి కూడా నిర్ణయిస్తాయి. ఇది అర్థం చేసుకుంటే మొత్తమంతా అర్థమైపోతుందా అనే ప్రశ్నను కొంచెం సేపు పక్కకు పెట్టండి. ఇది కీలకం అని మాత్రం అర్థం చేసుకోండి. ఉత్పత్తి వ్యవస్థను పట్టించుకోకుండా, అర్థం చేసుకోకుండా, దాని పర్యవసానాలను గుర్తించకుండా మనం చరిత్రను అర్థం చేసుకోలేము. ఇది అర్థమయితే మొత్తం అర్థమైపోతుందా అనేది మార్క్సిజానికి సంబంధించిన మౌలికమైన ప్రశ్న. అది వేరే చర్చ. కాని పెట్టుబడిదారీ పూర్వ సమాజాలలో non-economic, extra-economic and extra-proprietary relations అనేవి ఉత్పత్తి సంబంధాలలో ఒక భాగం. ఆ సంబంధాలలో కులం కూడా ఒకటి.

## కులానికి ఉన్న బహుముఖాలు

ఒక ఆర్థికేతర, యాజమాన్యేతర ఉత్పత్తి సంబంధంగానే కాక కులానికి వేరే ప్రాముఖ్యత కూడా ఉంది. కర్మకాండకు సంబంధించినటువంటి సంబంధంగా కూడా అది పని చేసింది. స్త్రీలపైన రకరకాల ఆంక్షలు పెట్టే ఒక వర్ణధర్మంగా కూడా అది పని చేసింది. కులానికి రకరకాల ప్రాముఖ్యతలు ఉన్నా ఒక ముఖ్యమైన ప్రాముఖ్యత మాత్రం ఉత్పత్తి సంబంధంగా పని చేయడమే. నిజానికి చారిత్రక భౌతికవాదం పుస్తకాలు చదువుతుంటే, మామూలుగా దాన్ని అప్లై చేసుకుంటే ఈ విషయం సింపుల్‌గా అర్థమవుతుంది. ఉత్పత్తి సంబంధాలంటే ఏమిటీ అంటే ఎవరికి దేని మీద యాజమాన్యం ఉంది, ఎవరికి ఏ పనిముట్ల మీద యాజమాన్యం ఉంది అని. మన సమాజంలో ఉన్న కులవ్యవస్థ ప్రకారం 'మంగలి కత్తి' మీద యాజమాన్యం మంగలి వాళ్లకు మాత్రమే ఉంది. మరి అది ఆర్థిక సంబంధమే కదా, ఉత్పత్తి సంబంధమే కదా. కమ్మరి ఉపయోగించే కొలిమి మీద యాజమాన్యం కమ్మరికి మాత్రమే ఉంటుంది. వేరే వాళ్లకు అది ఉండదు. అలాగే ఇతనికి వేరేదేదైనా కావాలంటే దొరకదు. భూమి మీద యాజమాన్యం తొలినాడు వర్ణధర్మం ప్రకారం వైశ్యులకు మాత్రమే ఉండాలి. తరువాత కాలంలో, అంటే చరిత్ర మారే క్రమంలో దానిలో ఎలాగోలా వేరే వాళ్ళను కూడా ఇరికించాలని సత్–శూద్రులు అని చెప్పి బ్రాహ్మణులు దాంట్లో చిన్న మార్పులు చేశారు. మొత్తానికైతే కొంతమందికి మాత్రమే భూమి మీద యాజమాన్యం ఉండొచ్చన్నారు. ఉత్పత్తి సాధనాల మీద యాజమాన్యాన్ని నిర్ణయించడంలో కులానికొక కీలకమైన పాత్ర ఉన్నప్పుడు, అది ప్రత్యక్షంగానే ఉత్పత్తి సంబంధం అవుతుంది. దానికి పెద్ద వివరణ, పెద్ద సిద్ధాంతాలు, పెద్దగా చదవాల్సిన అవసరమేమీ లేదు. అయినా చాలా కాలం దాన్ని ఎందుకు

చూడలేకపోయారు, ఎందుకు అర్థం చేసుకోలేకపోయారు అనేది ప్రశ్న. చూడగలిగిన తరువాత దానిలో అనుమానమేమీ లేదు. ఒక ఆర్థిక సంబంధంగా, ఉత్పత్తి సంబంధంగా కులమనేది పని చేస్తుంది.

## కులమే వృత్తిని నిర్ణయించింది

ప్రతి మనిషీ తన కడుపు నింపుకోవటానికైనా, తన వాళ్ళ కడుపు నింపటానికైనా, బజార్లో అమ్ముకోటానికైనా ఉత్పత్తి చేయాలి అని పూనుకున్నప్పుడు, ఏ రకమైన ఉత్పత్తి సాధనాలు ఆ వ్యక్తికి అందుబాటులో ఉన్నాయి అనే ప్రశ్న వేసుకుంటే, ప్రధానంగా కులం దానిని నిర్ణయించింది. కులమే వృత్తిని నిర్ణయించింది. ఆ వృత్తే మీకు అందుబాటులో ఎటువంటి technological implements ఉండాలో నిర్ణయించింది. మీ వృత్తి ప్రకారం మీ తండ్రిగారి దగ్గర నుంచి మీకు కొన్ని ఉత్పత్తి సాధనాలు సంక్రమిస్తుంటాయి. కొన్ని తయారుచేసుకుంటారు, కొనుక్కుంటారు, ఉపయోగించుకుంటారు. అంటే ప్రత్యక్షంగానే అక్కడ కులం అనేది ఒక ఉత్పత్తి సంబంధంగా పని చేసింది. అదే సమయంలో ఇతర సామాజిక రంగాలకు సంబంధించినటువంటి ఒక సంబంధంగా కూడా కులం పని చేసింది. నీకు మోక్షం రాదు, నువ్వు శూద్రుడివి కాబట్టి. నీకు మోక్షం సులభంగా వస్తుంది, బ్రాహ్మణుడివి కాబట్టి. కొంచెం కష్టపడితే మీకు మోక్షం వస్తుంది, మీరు వైశ్యులు, క్షత్రియులు కాబట్టి. అంటే ఇక్కడ మోక్షానికి సంబంధించినటువంటి ఒక వర్గీకరణగా పనిచేసింది కులం. అట్లా రకరకాల రూపాల్లో పని చేసింది. అయితే మౌలికంగా ఒక ఉత్పత్తి సంబంధంగానే కులం పని చేసింది. కాబట్టి కులం అనేది పునాదిలో భాగం అనే దానికి పెద్ద విశ్లేషణ, పెద్ద చర్చ ఏమీ అవసరం లేదు. అది పునాదిలోనూ భాగమే, పునాదియేతరమైన సంస్కృతి, ఇతర సాంఘిక సంబంధాల్లో కూడా భాగమే. అది మొత్తంగా భారతీయ సమాజాన్ని, హైందవ సమాజాన్ని నిలువుగా చీల్చి అన్ని రంగాల్లో కూడా వర్గీకరణను చేపట్టింది. ఉత్పత్తి వ్యవస్థలో వర్గీకరణ చేపట్టింది, ఇతర రంగాల్లో కూడా వర్గీకరణ చేపట్టింది. ఆ స్వభావం కులవ్యవస్థ కున్నది.

మరో ప్రశ్న. ఇది ఎక్కడ మొదలయ్యింది, ఎప్పుడు మొదలయ్యింది, చారిత్రక క్రమంలో ఏ రకమైన మార్పులు దీంట్లో వస్తూ వచ్చాయి అనే ప్రశ్న వేసుకోవడం కూడా అవసరం. ఎందుకు అవసరం అంటే, చరిత్రతో నిమిత్తం లేకుండా కులాల గురించి మాట్లాడటం ఇప్పుడు చాలా కామన్ అయింది. చరిత్రతో ఏం సంబంధం లేకుండా,

చారిత్రకంగా వచ్చినటువంటి మార్పులను గుర్తించకుండా, వివిధ దశల్లో కులానికి ఉన్నటువంటి పాత్ర గానీ, ప్రాముఖ్యత గానీ గుర్తించకుండా కులవ్యవస్థ ఇప్పుడున్నట్టే ఎప్పుడూ ఉండింది అనే అభిప్రాయం ఒకటి; వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ మధ్య ఉండేటటువంటి తేడాను గానీ, వాటి మధ్యన ఉన్న అంతర్గత వైరుధ్యాలను గానీ పట్టించుకోకుండా వర్ణవ్యవస్థను గురించి మాట్లాడితే కులవ్యవస్థను గురించి మాట్లాడినట్లే అనడం గానీ; ఇవాళ్టి రాజకీయ అవసరాల కోసం వాటిని వెనక్కు ప్రొజెక్ట్ చేసి చరిత్రను అర్థం చేసుకోవటం గానీ... ఇవన్నీ కూడా మనకు చాలా కనిపిస్తూ ఉంటాయి. అభ్యుదయకరమైన ఉద్యమాల్లోనూ కనిపిస్తాయి, ఇతర రంగాల్లోనూ కనిపిస్తాయి. ఇప్పుడు రకరకాల కులాల వాళ్ళు – కాకతీయులు కమ్మ వాళ్ళు అనీ, శాతవాహనులు కాపులు అనీ అంటున్నారు. అసలు ఆ రోజుల్లో కమ్మ అనే కులం ఉండిందా? ఎప్పుడు పుట్టింది ఆ కులం? కాకతీయులు కమ్మవాళ్ళు అనడంలో అర్థమేమన్నా ఉంటుందా! శాతవాహనులు కాపులు అనే దాంట్లో అర్థమేమన్నా ఉంటుందా అనే ప్రశ్నలు వేసుకోకుండా, చరిత్రతో నిమిత్తం లేకుండా ఇవ్వాళ ఉన్న కులవ్యవస్థ శాశ్వతంగా ఇట్లే ఉండేది అన్నట్లుగా చరిత్రకు దానిని అన్వయించి మాట్లాడటం రకరకాల ఉద్యమాల్లో, రకరకాల రాజకీయాల్లో జరుగుతున్నది కాబట్టి కులాన్ని చారిత్రకంగా అర్థం చేసుకోవటం అనేది చాలా అవసరం.

రాయలసీమ జిల్లాల్లో వేమన కులమేంది అని ఒక చర్చ చాలా కాలం నడిచింది. మా తాతగారు కూడా ఆ చర్చలో పాల్గొన్నారు. చివరికి వేమన రెడ్డి అని తేల్చారు అందరూ కలిసి. వేమన రెడ్డి కాదు ఆయన artisan, అంటే వడ్రంగి గానీ కంసాలి గానీ ఆ రకమైన కులాలకు చెందిన వాడు అయ్యుంటాడు అనేది ఇంకొక అభిప్రాయం. ఇక్కడ సమస్య ఏంటంటే రాయలసీమ జిల్లాల్లో రెడ్డి అనేది ఒక స్పష్టమైన కులంగా మారింది ఈ మధ్య కాలంలోనే. వేమన బ్రతికింది కొన్ని శతాబ్దాల కింద. ఇవాళ మనకుండే ఈ కులాలన్నీ ఇదే నమూనాలో అప్పుడు కూడా ఉన్నాయి అని చరిత్రతో ఏమీ సంబంధం లేకుండా వేమన కులం ఏమిటన్న ప్రశ్న వేసుకొని ఆయన రెడ్డి అని నిర్ణయించారు. మీరు రాయలసీమకు పోతే పేరు వెనుక రెడ్డి అని ఉన్నవాళ్ళలో చాలామందిని మీ కులం ఏమిటని అడిగితే కాపు అని చెప్తారు సాధారణంగా. ఇప్పుడిప్పుడు రాజకీయాల్లో భాగంగా కులం స్పృహ పెరుగుతోంది కాని పది–పదిహేనేళ్ల క్రితం మాత్రం కచ్చితంగా చాలామంది రెడ్లను నీ కులం ఏమిటి అని కర్నూల్లో గానీ, కడపలో గానీ అడిగితే, నా కులం కాపు అని చెప్పేవారు, రెడ్డి అని చెప్పేవారు కాదు. అటువంటిది మనం వేమన కులం రెడ్డా

కాదా అనే ప్రశ్న వేసుకుని దాని మీద చాలా చర్చ చేసుకున్నాం. ఈ చర్చలో సిద్ధాంతవేత్తలు, పండితులు ఎందరో పాల్గొన్నారు. రాజకీయాలలో కులానికి రకరకాల ప్రయోజనాలు ఉన్నాయి. మా కులంలో చాలా గొప్పవాడు ఒకడు ఉన్నాడని చెప్పుకోవటం వల్ల కొన్ని ప్రత్యేకతలు వస్తాయి కాబట్టి రెడ్లకు అది అవసరం అయింది. ఇటువంటి చాలా ఉదాహరణలు ఇవ్వవచ్చును. తర్వాత ఇస్తాను.

## రెవెన్యూ యంత్రాంగం ముఖ్య పాత్ర

మౌలికంగా మనం వర్ణవ్యవస్థను గానీ, కులవ్యవస్థను గానీ అర్థం చేసుకునేటప్పుడు ఉత్పత్తి వ్యవస్థ నుండి విడదీసి దాన్ని అర్థం చేసుకోవటం చాలా పొరపాటు. అట్లా అని ఉత్పత్తి వ్యవస్థను అర్థం చేసుకుంటే కులం మొత్తం అర్థమైపోతుందని కాదు. నిజానికి ఉత్పత్తి వ్యవస్థను మొత్తం అర్థం చేసుకుంటే సమాజం, చరిత్ర అన్నీ అర్థమయిపోతాయి అనే మార్క్సిస్టు ప్రతిపాదన వాస్తవమేనా అనేది చాలా పెద్ద ప్రశ్న. అది ప్రస్తుతానికి పక్కకు పెడదాం. కానీ ఉత్పత్తి వ్యవస్థను అర్థం చేసుకోకపోతే మాత్రం మనకు కులం అర్థం కాదు. ప్రాచీన కాలంలో వ్యవసాయ వర్గ సమాజం అంటే ఆహార సేకరణ, పశు పోషణ దశ నుండి, అంటే తిండి గింజలు ఏరుకుంటూ, కాయలు పండ్లు ఏరుకుంటూ, వేటాడుకుంటూ, పశువులను పోషించుకుంటూ తిరిగే దశ నుంచి స్థిర వ్యవసాయం చేసే దశకు వచ్చిన మార్పు; స్థిర వ్యవసాయం అంటే ఇన్ని కమతాలు అనీ, నాగలి, ఎడ్లు, స్థిరమైన గ్రామం ఇవన్నీ ఉండి వ్యవసాయం చేసేటటువంటి దశ; ఆ దశ స్థిరపడేటువంటి ఆ చరిత్ర, దానితో కలిపి, దానికి అన్వయించుకొనే కులవ్యవస్థను అర్థం చేసుకోవాలి. మధ్యయుగాలకు వచ్చేటప్పటికి వ్యవసాయ ఆర్థిక వ్యవస్థ, దానితో పాటు రెవెన్యూ యంత్రాంగాన్ని కూడా లెక్కలోకి తీసుకోవాలి. ఎందుకంటే భారతదేశంలో ప్రాచీన కాలంలో కొంతవరకు, ఢిల్లీ సుల్తానులు వచ్చిన తరువాత చాలా ప్రధానంగా రెవెన్యూ యంత్రాంగమే దేశంలో ఉత్పత్తైన సంపద ఎవరికెంత చెందుతుందని పంచటంలో ముఖ్యమైన పాత్ర నిర్వహించింది. కేవలం ప్రభుత్వం ఖర్చుల కోసం ఈ రోజుల్లాగా పన్నులు వసూలు చేసే యంత్రాంగం కాదు రెవెన్యూ యంత్రాంగం. ఫిరోజ్ తుగ్లక్ గానీ, అల్లాఉద్దీన్ ఖిల్జీ గానీ వాళ్ళు తయారు చేసిన రెవెన్యూ యంత్రాంగం దేశం మొత్తంలో జరిగే ఉత్పత్తిలో సగ భాగాన్ని పాలక వర్గాలకు చెందినటువంటి ప్రముఖులు ఏ రకంగా పంచుకోవాలని నిర్ణయిస్తుంది. ఆ రెవెన్యూ యంత్రాంగాన్ని దృష్టిలో పెట్టుకోకుండా మనకు ఉత్పత్తి వ్యవస్థ

అర్థం కాదు. కాబట్టి మధ్యయుగాల నాటి గ్రామీణ వ్యవసాయ, ఇతర చేతి వృత్తుల వ్యవస్థ, రెవెన్యూ యంత్రాంగం, రెండిటిని లెక్కలోకి తీసుకుంటేనే మనకు ఈ కులవ్యవస్థ అర్థం అవుతుంది.

## పెట్టుబడిదారీ సంబంధాలనూ లెక్కలోకి తీసుకోవాలి

అలాగే ఆధునిక కాలంలో పెట్టుబడిదారీ సంబంధాలను కూడా లెక్కలోకి తీసుకుని మనం కులాన్ని, కులవ్యవస్థను అర్థం చేసుకోవాల్సిన అవసరం ఉంది. బ్రిటిష్ వాళ్ళ రాకతో ఇవి భారతదేశంలోకి ఏదో ఒక మేరకు ప్రవేశించాయి. ఒక వలసవాద ప్రభుత్వం దానికున్న నిర్దిష్ట స్వరూపంతో తీసుకొచ్చిన పెట్టుబడిదారీ సంబంధాలే కాదు, స్వతంత్రం వచ్చిన తరువాత విస్తృతమైన పెట్టుబడిదారీ వ్యవస్థను కూడా లెక్కలోకి తీసుకొని సమన్వయపరుచుకోకపోతే, ఈ చరిత్ర నుంచి దాన్ని వేరు చేస్తే కులవ్యవస్థ పూర్తిగా అర్థం కాదు. కులాన్ని పట్టించుకోకుండా కేవలం భూమి సంబంధాల గురించి మాత్రమే వ్యాఖ్యానిస్తాను అంటే చరిత్ర అర్థం కాదు. అలాగే భూమి సంబంధాలు, చరిత్రను పట్టించుకోకుండా కులాన్ని అర్థం చేసుకుంటాను అంటే కులం అర్థం కాదు. భవిష్యత్తులో ఏ రకమైన ఆచరణ చేపట్టాలనేది అర్థం కాదు. కాబట్టి ప్రాచీన కాలంలో స్థిరపడుతున్నటువంటి వ్యవసాయక సమాజాన్నీ; మధ్యయుగాల్లో స్థిరపడినటువంటి వ్యవసాయక సమాజంతో పాటు రెవెన్యూ యంత్రాంగాన్నీ; ఆధునిక కాలంలో వీటితోపాటు పెట్టుబడిదారీ సంబంధాలను కూడా లెక్కలోకి తీసుకుంటేనే మనకు వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ అనేవి సమగ్రంగా అర్థం కావచ్చు.

ఇప్పుడు ఈ మూడిటి గురించి క్లుప్తంగా చెప్పే ప్రయత్నం చేస్తాను.

మన దేశ చరిత్రకారుల్లో కుల వ్యవస్థకు, వర్ణవ్యవస్థకు ఇవ్వవలసినటువంటి ప్రాముఖ్యాన్ని ఇచ్చి ప్రాచీన చరిత్రను అర్థం చేసుకునే ప్రయత్నం D.D Kosambi, R.S Sharma, Romila Thapar వంటి ప్రొఫెషనల్ హిస్టారియన్స్, రాజకీయ ఉద్యమకారుల్లో అంబేడ్కర్ వంటివారు చేశారు. మధ్యయుగాలకు సంబంధించి, ఆధునిక కాలానికి సంబంధించి మార్క్సిస్టు చరిత్రకారులు గానీ, ఇతర చరిత్రకారులు గానీ ఇప్పటివరకు కులవ్యవస్థను లింక్ చేయటమనేది చాలా తక్కువగా చేశారు కాబట్టి ఆ చరిత్ర ఇంకా చాలా డెవలప్ కావాల్సి ఉంది. కొంత చేస్తున్నారు కానీ ఎక్కువ చేయలేదు. ప్రాచీన కాలానికి సంబంధించి మాత్రం కోశాంబి ప్రభావం వల్ల వర్ణవ్యవస్థకు, కులవ్యవస్థకు

ప్రాముఖ్యం ఇచ్చి ఉత్పత్తి వ్యవస్థను అర్థం చేసుకోవటం, చరిత్రను అర్థం చేసుకోవటం అనేది జరుగుతూ వచ్చింది.

వీటన్నిటి వివరాల్లోకి ఎంత లోతుకు పోవాలో నాకే అర్థం కావట్లేదు, కొంచెమైతే చెప్పే ప్రయత్నం చేస్తాను. ఆర్యులు, మొన్నటిదాకా సోవియట్ రష్యాగా ఉన్న ప్రాంతం నుండి దాంట్లో కొత్తగా పుట్టిన ఎన్నో దేశాల్లోని ఒక ప్రాంతం అయిన కాకసస్ ప్రాంతం నుండి ఇరాన్ మీదుగా వచ్చారని; ఆ రకంగా వచ్చి ఇవాల్టి పంజాబ్ ప్రాంతంలో – ఇవాల్టి పంజాబ్ అంటే పాకిస్తాన్ పంజాబ్, ఇండియా పంజాబ్ రెండూ కలిసిన ప్రాంతం – స్థిరపడి అక్కడ పశుపోషకులుగా ఉన్నారని; వారి జీవితంలో వచ్చిన మార్పుల నుంచే వర్ణ వ్యవస్థ పుట్టిందనేది సాధారణంగా చరిత్రకారులందరూ కూడా ఇవాళ కరెక్టని భావించే విషయం. అయితే ఈ ఆర్యులు ఒక్కసారి రాలేదు, దాదాపు వెయ్యి సంవత్సరాల పర్యంతం లేదా పదిహేను వందల సంవత్సరాల పర్యంతం, అంటే క్రీస్తు పూర్వం 2000 నుండి క్రీస్తు పూర్వం 500 సంవత్సరం వరకు గుంపులు గుంపులుగా వస్తూనే ఉన్నారు. చిన్న సంఖ్యలో రాలేదు, పెద్ద సంఖ్యలో వచ్చారు. ఒక సింపుల్ సిద్ధాంతం, ముఖ్యంగా తమిళనాడులో ద్రవిడ ఉద్యమం నుంచి ముందుకొచ్చిన సిద్ధాంతం ఏమిటంటే, ఆర్యులు రాకముందు ఇక్కడ అంతా ద్రవిడులు ఉండేవాళ్ళు, ఆర్యులొచ్చి ఈ ద్రవిడులను మొత్తం లొంగదీసుకుని శూద్రులుగా మార్చారని, ఆర్యులేమో అగ్రవర్ణాలుగా ఉన్నారని ఆ సిద్ధాంతం చెపుతుంది. ఇవాళ చరిత్రకారులు మాత్రం అది అంత సింపుల్‌గా జరగలేదు, అది చాలా సంక్లిష్టమైన విషయమని చెపుతున్నారు.

## వర్ణవ్యవస్థ ఋగ్వేద కాలంలో లేదు

మొదట వచ్చిన ఆర్యులలో తెగ నిర్మాణం ఉండేది. ఋగ్వేదంలో క్షత్రియ అనే మాట ఉంది కానీ రాజన్యులు అనే మాటే ఎక్కువ వాడారు. అంటే పరిపాలించేవాళ్ళు అని. అట్లాగే బ్రాహ్మణులు అనే మాట ఉంది కానీ, బ్రాహ్మణుడు నిర్వహించేటటువంటి వైదిక కర్తవ్యాన్ని బట్టి 'స్తోత' (స్తుతించబడే వాడు) అనే మాట ఎక్కువగా వాడారు. అంటే వర్ణవ్యవస్థ అనేది ఋగ్వేద కాలంలో లేదు. గణం, తెగ మాత్రమే ఉండేవి. తెగ ముఖ్యులను రాజన్యులు–క్షత్రియులు అనే వాళ్ళు, తెగ పురోహితులను బ్రాహ్మణులు–స్తోత అనే వాళ్ళు. ఋగ్వేద కాలం వరకు అంతే ఉండేదని సాధారణంగా చరిత్రకారులు చెప్పే విషయం. అయితే ఋగ్వేదంలో ఉందని తర్వాతి కాలాల్లో బ్రాహ్మణ ధర్మశాస్త్రకారులు విపరీతంగా ఉటంకించిన ఒక అధ్యాయం ఉంది, పురుషసూక్తం అంటారు దానిని.

బ్రాహ్మణులకు ముందునుంచి ఉన్న ఒక అలవాటు ఏమిటంటే ఎప్పటికప్పుడు వ్యవస్థను పదిలపరచటానికి, పటిష్టం చేయటానికి తాము కొత్తగా తీసుకొస్తున్న మార్పులన్నిటినీ వేదాల్లో ఇరికించటం. ఇది బ్రాహ్మణులకు బాగా అలవాటైన విషయం. పురుషసూక్తాన్ని నేరుగానే వేదాల్లో ఇరికించారు, మిగిలిన వాటిని వేదాల్లో ఇరికించకుండా తరువాతి కాలంలో భాష్యాలుగా రాశారు. మొత్తం బ్రాహ్మణ మేధోచరిత్రను చూస్తే భాష్యకారులగా తప్ప సొంతంగా నేను ఈ మాట చెప్తున్నాను అన్న బ్రాహ్మణ తాత్వికుడు ఒక్కడూ లేడు. సొంత తెలివి లేదని కాదు వాళ్లకి. ఏదైనా ఒక అభిప్రాయాన్ని బలంగా సమాజంలో నిలబెట్టాలి అంటే అది అతి ప్రాచీనమైన విషయం అని చెప్పడం బ్రాహ్మణ సంస్కృతికి సంబంధించిన ఒక లక్షణం. ఉపనిషత్తుల కాలం నుంచి సర్వేపల్లి రాధాకృష్ణన్ వరకు ఇదే కనిపిస్తుంది. 20వ శతాబ్దపు గొప్ప బ్రాహ్మణ తత్వవేత్తగా పేరు తెచ్చుకున్న సర్వేపల్లి రాధాకృష్ణన్ ఏమన్నాడు? నేను కొత్తగా ఏమీ చెప్పటం లేదు శంకరాచార్యుడ్ని వ్యాఖ్యానిస్తున్నాను అన్నాడు. శంకరాచార్యుడు ఏమన్నాడు? నేను కొత్తగా ఏమీ చెప్పడం లేదు బాదరాయణుడి బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానం రాస్తున్నాను అన్నాడు. బాదరాయణుడు ఏమన్నాడు? నేను వేదాలకు వ్యాఖ్యానం రాస్తున్నాను తప్ప కొత్తగా ఏమీ చెప్పడం లేదు అన్నాడు. మొత్తం బ్రాహ్మణీయ సంస్కృతిలో రాధాకృష్ణన్ మాట్లాడినా, చక్రవర్తుల రాజగోపాలాచారి మాట్లాడినా, భారత, రామాయణాలను ఆయన ఇంగ్లీషులో రాసినా సమకాలీన రాజకీయాల కోసమే రాసారు. బ్రాహ్మణీయ సంస్కృతిని కొంచెం మార్చో, కొంచెం సర్దుబాటు చేసో సమకాలీన రాజకీయాలకు అనుగుణంగా బలంగా నిలబెట్టడం కోసమే రాశారు వాళ్ళు. ఇద్దరూ కూడా నేను కొత్తగా ఏమీ రాయటం లేదు, దీన్ని శంకరాచార్యుడే చెప్పాడు అన్నారు.

బౌద్ధానికి వ్యతిరేకంగా బ్రాహ్మణ సంస్కృతిని నిలబెట్టడం కోసం ప్రయత్నం చేసినవాడు శంకరాచార్యుడు. ఆయన ఏమంటాడు? నేను ఎప్పటివో బ్రహ్మసూత్రాలను వ్యాఖ్యానిస్తున్నాను, కొత్తగా ఏమీ చెప్పటం లేదని అంటాడు. బ్రహ్మసూత్రాల వ్యాఖ్యాతలు ఏమంటారంటే మేము వేదాల్లో ఉన్నది చెప్తున్నాము అంటారు. ఇంతా చేసి ఆ వేదంలో ఏముంది అంటే: ఓ ఇంద్రా! నాకు పశువులివ్వు, నా శత్రులందరిని చంపు, నేను నీకు బాగా సారాయి పోస్తా, ఇదే ఉంటుంది ఆ వేదం నిండా. దాన్ని వ్యాఖ్యానించడం ద్వారానే మేము ఇంత సంక్లిష్టమైన, సంకీర్ణమైన ఫిలాసఫీ చెబుతున్నామని అప్పటినుండి చెప్పుకుంటూ వచ్చారు. ఆ వేదంలో తర్వాత కాలంలో బ్రాహ్మణ పురోహితులు చొప్పించింది ఏమిటంటే పురుషసూక్తం. ఆ పురుషసూక్తంలోనే మొట్టమొదటిసారిగా అధికార భావజాలమే, అధికార

మతమే నిచ్చెనమెట్ల కులవ్యవస్థను సరైనది అని సమర్థించింది. పాలక మతం అసమానతలను సమర్థించడం ఇతర దేశాలలో ఎక్కడా లేదు.

నేను మొదట్లో చెప్పినట్టుగా పెట్టుబడిదారీ పూర్వ సమాజాలు అన్నిటిలో పౌర ప్రతిపత్తి సమానంగా లేకపోవటం – కొంతమంది హెచ్చు, కొంతమంది తక్కువ, కొంతమంది స్వేచ్ఛగలిగిన వాళ్ళు, కొంతమంది బానిసలు; కొంతమంది నోబుల్సు, కొంతమంది సామాన్యులు – అనేది అన్ని సమాజాల్లోనూ ఉంది. ప్రజల హక్కుల్లో తేడాలుంటాయి, ప్రతిపత్తిలో తేడాలుంటాయి, అధికారంలోనూ తేడాలుంటాయి. కాని క్రైస్తవం గానీ, ఇస్లాం గానీ, బౌద్ధం గానీ ఈ అసమానతలను ఎప్పుడూ సిద్ధాంతీకరించలేదు. ఆచరణలో రాజీపడ్డ మాట నిజమే, ఆ మాటకొస్తే ఆచరణలో అన్నీ రాజీ పడ్డాయి కాని అవి ఈ అసమానతలను సిద్ధాంతీకరించలేదు. బ్రాహ్మణ హైందవ మతం మాత్రమే దాన్ని సిద్ధాంతీకరించి వర్ణధర్మం పేరు మీద ఇదే కరెక్టు అని చెప్పింది. ఆ సిద్ధాంతీకరణలో తొలిమెట్టు పురుషసూక్తం. దాన్ని బలవంతంగా ఋగ్వేదంలో పెట్టారనేది అందరి అభిప్రాయం. ఇది కేవలం అంబేడ్కర్ అభిప్రాయం మాత్రమే కాదు.

భాషను పరిశీలించి, కేవలం భాషా పరంగా ఏది ఒక గ్రంథానికి చెందింది, ఏది కాదు అని నిర్ణయిస్తారు. అదొక ప్రొఫెషన్. దాని ప్రకారంగా కూడా పురుష సూక్తంలో ఉన్న భాష అంత ప్రాచీనమైన సంస్కృతం కాదు అని నిర్ణయించారు, దాని తర్వాత కాలంలో తయారుచేసి ఇరికించారు అని చెప్పారు. ఆ పురుష సూక్తంలో చెప్పినదాన్నే ఆ తర్వాత మనుధర్మ శాస్త్రంలో, మిగతా అన్ని ధర్మశాస్త్రాల్లో చెప్పుకుంటూ వచ్చారు. అదేమిటి అంటే – సృష్టి ఏ రకంగా జరిగిందనేది. అన్ని మతాల్లోనూ సృష్టికి సంబంధించిన కథలు ఉంటాయి. అయితే సృష్టి అసమానంగా జరిగిందనే కథ మాత్రం ఏ మతంలోను ఉండదు. క్రైస్తవంలో ఉండదు, ఇస్లాంలో ఉండదు, దేంట్లో ఉండదు. రకరకాల వింత వింత కథలుంటాయి. అన్నీ కూడా పుక్కిటి పురాణాలే. కానీ పురుష సూక్తంలో మాత్రం భగవంతుడు తన తొలి సృష్టిలోనే మనుషులను అసమానంగా సృష్టించాడు అని ఉంటుంది. ఆది పురుషుడి ముఖం నుండి బ్రాహ్మణులు పుట్టారు, భుజాల నుండి క్షత్రియులు పుట్టారు, వైశ్యులేమో ఒకసారి తొడల నుండి పుట్టారని, ఒకసారి ఉదరం నుండి పుట్టారని, శూద్రులేమో పాదాల నుండి పుట్టారని పురుషసూక్తంలో చెప్పారు. తరువాత వచ్చినటువంటి వైదిక సాహిత్యంలో, బ్రాహ్మణాలలో, శుల్బ సూత్రాల్లో దాన్ని వ్యాఖ్యానిస్తూ ఏమంటారంటే – ముఖం శరీరంలో ప్రశస్తమైన భాగం కదా, దాన్నుండి పుట్టిన వాళ్ళు ప్రశస్తమైన

వాళ్ళు, అంటే బ్రాహ్మణులు; భుజాలనేవి బలాన్ని సూచిస్తాయి కదా, దాన్నుండి పుట్టినవాళ్ళు బలవంతులు, అంటే క్షత్రియులు; తొడలు లేదా కడుపు నుండి పుట్టినవాళ్ళు వైశ్యులు. కడుపంటే ఏమిటి? ఆహారం. వైశ్యులు తరువాత వ్యాపారస్తులు అయ్యారు గానీ తొలినాడు వారు వ్యవసాయకులే. నాలుగో వాళ్లయిన శూద్రులు వట్టి కూలివాళ్ళు మాత్రమే. అందుకే వాళ్ళు కాళ్ళ నుండి వచ్చారు. శూద్రులకు కాళ్ళు ఎందుకంటే, కాళ్ళు ఏం చేస్తాయి? మొత్తం శరీరాన్ని మోస్తాయి. మిగిలిన మూడు ధర్మాలను మోసే ధర్మం కాళ్ల నుండి వచ్చిన శూద్రులదని తరువాత కాలంలో ఈ వైదిక శాస్త్రాలు, ధర్మశాస్త్రాలు వ్యాఖ్యానించాయి. ఇది ఋగ్వేద కాలం నాటి సమాజం నుంచి వచ్చింది కాదు. తరువాత కాలంలో వేదంలో చొప్పించారనేది దాదాపుగా ఉన్నటువంటి అవగాహన. ఎందుకంటే ఋగ్వేద కాలం నాటి ఆర్యులు పశువులను పోషించుకుంటూ తిరుగుతూ ఉండేవారు. ఒకరి శ్రమను మరొకరు దోచుకోవడానికి – దీన్ని అర్థం చేసుకోవడానికి మనం ఉత్పత్తి వ్యవస్థ సహాయం తీసుకోవాలి – కావలసిన మిగులు ఉత్పత్తి (surplus production) వారికి లేదు. పశువులను పోషించుకుంటున్నారు, కోసుకుంటున్నారు, తింటున్నారు అంతే.

## మొదట్లో అందరూ గోమాంస భక్షకులే

పూర్వకాలంలో బ్రాహ్మణులందరూ కూడా బ్రహ్మాండమైన గోమాంస భక్షకులే, గోవును తిన్న వాళ్ళే. సమాజంలో వచ్చిన మార్పుల వల్ల, బౌద్ధమతం ప్రభావం వల్ల గోమాంస భక్షణకు వ్యతిరేకత వచ్చినప్పుడు బ్రాహ్మణులలో కూడా దాని మీద చర్చ వచ్చింది. ఆ చర్చకు సంబంధించిన ఆసక్తికర కథ కూడా ఒకటి ఉంది. శతపథ బ్రాహ్మణంలో యాజ్ఞవల్క్యుడు చెప్పిన మాటలుంటాయి. ఇవ్వాల్టికీ యాజ్ఞవల్క్యుడు బ్రాహ్మణ ఉపనిషత్తుకారులలో చాలా గొప్పవాడి కింద లెక్క. యాజ్ఞవల్క్యుడు అందరి కంటే గొప్ప ఉపనిషత్తుకారుడు అని సర్వేపల్లి రాధాకృష్ణన్ వంటి ఆధునిక తత్వవేత్తలు కూడా అంటారు. గోవు పాలు ఇస్తుంది కదా, అటువంటి దాన్ని నరకడం, తినడం కరెక్ట్ కాదు కదా అని ఒక బ్రాహ్మణుడు యాజ్ఞవల్క్యుడితో ఒకసారి చర్చ పెట్టుకుంటాడు. మన దగ్గర కూడా బి.జె.పి వాళ్ళు మామూలుగా అంటుంటారు కదా – గోవు పాలు ఇస్తుంది, గోవు అందరికీ అది ఇస్తుంది, ఇది ఇస్తుంది అని, అలాగే. అతని వాదన అంతా విన్నాక చివరికి యాజ్ఞవల్క్యుడు ఏమంటాడంటే, అంతా కరెక్టే కానీ రుచిగా ఉంటే మాత్రం నేను తింటా

అంటాడు. అది బ్రాహ్మణులలో ఈ చర్చ ఇంకా జరుగుతున్న దశ. ఋగ్వేద కాలం నాడు అందరూ ప్రధానంగా పశుపోషకులే, ఆ పశువులను కోసుకొని తిన్నవాళ్లే. ఋగ్వేదం నిండా ఆర్యులు తమ శత్రువుల మీద ఇంద్రునికి, అగ్నికి చేసుకున్న విజ్ఞాపనలే కనిపిస్తాయి. వాడ్ని చంపు, వీడ్ని చంపు, వాడ్ని నాశనం చెయ్యి, వీడిని నాశనం చెయ్యి, లేకపోతే నాకు పశువులను బాగా పెంచు, వర్షం బాగా పడేట్టు చూడు – ఇదే ఉంటుంది అందులో. అంటే పశువుల్ని పోషించుకుంటూ ఇతర గణాలతో, తెగలతో యుద్ధాలు చేసుకునే వారి ప్రార్థనలే ఋగ్వేదం. ఆ ప్రార్థనలలో వాళ్ళు శత్రువులని చెప్పేవాళ్ళు ఎవరు అని పేర్లు చూస్తే దాస్యులు అని, దస్యులు అని, పణులు (Panis) అని ఇట్లా కొన్ని పేర్లు కనిపిస్తాయి. ఋగ్వేదం దాటి మిగిలిన వేదాలలోకి పోతే చండాలులు అని, నిషాదులు అని, నాగ జాతి అని మరికొన్ని పేర్లు కనిపిస్తాయి. కాని తర్వాత కాలంలో వచ్చిన మొత్తం ధర్మశాస్త్రాలు చదివితే బ్రాహ్మణులు విపరీతంగా ద్వేషించింది, అన్ని రకాలుగా చాలా హీనంగా, అసహ్యకరంగా చిత్రీకరించింది శూద్రులనే. కాని ఋగ్వేదంలో ఎక్కడ కూడా, పురుష సూక్తాన్ని మినహాయిస్తే, శూద్రులు అనే మాట లేదు.

## దాస్యులు, దస్యులు, పణులు

ఈ దాస్యులు, దస్యులు వగైరాలంతా ఎవరు అనే ప్రశ్నకు సింపుల్‌గా ఈ దేశంలో ఉన్న వాళ్ళందరూ ద్రవిడులు, ఆర్యులు బయటనుండి వచ్చినవాళ్ళు, ఆర్యులు ద్రవిడులను అణచివేసి శూద్రులుగా మార్చారని చెప్పడం కరెక్టు కాదు, ఆ సిద్ధాంతం దీనికి వర్తించదు. అది రకరకాల రాజకీయ ఉద్యమాల్లో భాగంగా వచ్చింది. Simplified సిద్ధాంతాలు రాజకీయాలకు పనికొస్తాయి కాబట్టి చేస్తూ ఉంటారు. వాస్తవానికి చరిత్రకారుల అభిప్రాయం ఏమిటంటే వీళ్ళు శత్రువులుగా చూపించిన వాళ్లలో కొంతమంది ఆర్యులే. అయితే వీళ్ళ కంటే ముందు వచ్చి సెటిల్ అయినటువంటి ఆర్యులు వాళ్ళు. దాస్యులు అనే వాళ్ళు ఋగ్వేద ఆర్యుల కంటే అయిదారు వందల సంవత్సరాల ముందే వచ్చి ఇక్కడ సెటిల్ అయిన వాళ్ళు. కొత్తగా వచ్చిన వాళ్ళు పాత వాళ్ళను శత్రువులుగా భావించారు. దస్యులు అనే వాళ్ళు మాత్రం తప్పనిసరిగా ఇక్కడి వాళ్ళే. వాళ్ళు ఏం భాష మాట్లాడారో, అది ద్రావిడ భాషో ఇంకొక భాషో మనకు తెలియదు కాని వాళ్ళు ఇక్కడి వాళ్ళే. పణులు అనే వాళ్ళు ఎవరై ఉండవచ్చును అంటే కోశాంబి ఏమంటాడంటే: పణి, వణిక్, వాణిజ్య ఇవి వ్యాపారానికి సంబంధించిన మాటలుగా, నాణాలకు సంబంధించిన మాటలుగా సంస్కృతంలో వస్తాయి కాబట్టి, హరప్పా మొహంజదారో నాగరికతలో వ్యాపారం బాగా

జరిగింది అనే దానికి చాలా ఆధారాలు ఉన్నాయి కాబట్టి, పణులు బహుశా అప్పటి వ్యాపారవర్గమే అయ్యుండొచ్చు అని కోశాంబి అంటాడు. అట్లా మొత్తానికి తమ కంటే ముందొచ్చి ఇక్కడ ఉంటున్న ఆర్యులు, తమ కంటే ముందొచ్చి ఇక్కడి ప్రజలతో కొంచెం కలిసిపోయి సగం ఆర్యులైనటువంటి వాళ్లు, పూర్తిగా స్థానిక ప్రజలైనటువంటి వాళ్ళు – వీళ్ళందరూ వాళ్లకు శత్రువులుగా కనబడ్డారు. అట్లాగే తెగ లోపల కూడా రకరకాల అంతర్గత విభేదాలు ఉంటాయి. కుదుర్లు అంటాం కదా – ఆ కుదుర్ల మధ్య కూడా యుద్ధాలు ఉంటాయి. ఇట్లా తమలో తాము ఘర్షణ పడ్డారు. ఇతర ఆర్యులతోనూ ఘర్షణ పడ్డారు. స్థానికంగా ఉన్నటువంటి దస్యులతోనూ ఘర్షణ పడ్డారు.

ఈ ఘర్షణ ప్రధానంగా పశువుల కోసం ఘర్షణ, నీటి కోసం ఘర్షణ. చాలా వేద మంత్రాల్లో ఉన్న ఆరోపణలు ఏమిటి? వాడు ఎవడో నదులను దారి మళ్లించాడు అని. పశువులను పోషించే వారికి నీళ్ళు కావాలి కదా. నీళ్లుంటేనే కదా పశువులకు మేత దొరుకుతుంది. వాడు నదిని దారి మళ్ళించాడు అంటే నదికి ఆనకట్ట కట్టి వాడు నీళ్లు తీసుకొని వ్యవసాయం చేసుకుంటున్నాడు అని. నేను నదికి దిగువన ఉన్నాను కాబట్టి నా పశువులకు నీళ్లు దొరకటం లేదు అని. ఇటువంటి ఆరోపణలే కనిపిస్తాయి.

ఋగ్వేద కాలం నాటి ఆర్యుల కంటే ముందొచ్చిన ఆర్యులకు గానీ, స్థానికులకు గానీ వాళ్లకు చిన్న చిన్న పట్టణాలు ఉండేవి. వాటిని పురములు అనేవారు. పురము అంటే కోట. పురాలను నాశనం చేసేవాడు అనే అర్థంలోనే ఇంద్రుడిని పురందరుడు అంటారు. ఈ పురాల కోసం చాలా యుద్ధాలు జరిగాయి. చాలా నాశనమయ్యాయి కూడా. ఈ క్రమంలో ఏం జరిగింది అంటే నాశనం కాబడిన పురాల వాళ్ళందరిని లోబరుచుకుని, వాళ్ళ చేత ఎక్కువ ఉత్పత్తి చేయించుకొని, ఎక్కువ సంపద అనుభవించే అవకాశాన్ని ఆర్యులు పొందారు. అది ఆర్య సమాజంలోనే వర్ణ విభజనకు దారి తీసింది. బయట నుంచి తర్వాతి కాలంలో శూద్రులు అని పిలవబడ్డ వాళ్ళు రావటానికి దారితీసింది. వర్ణ విభజన ఇప్పుడున్నంత లేకున్నా పౌరోహిత్యం చేసేవాడు బ్రాహ్మణుడు, గణ ముఖ్యుడు క్షత్రియుడు; బ్రాహ్మణులు, క్షత్రియులు కాని మిగిలిన ప్రజలందరినీ మొదట్లో విశ్ లేక విశా అనేవాళ్ళు. అంటే కామన్ పీపుల్, సామాన్య ప్రజలు అని. విశ్వవ్యాప్తంగా అంటాము కదా, అంటే అందరికీ సంబంధించింది అని. ఆ అర్థంలో విశా అనేవాళ్ళందరూ సామాన్య ఆర్య గణం ప్రజలు. సామాన్య ప్రజలు వ్యవసాయదారులయిన తరువాత ఈ విశా పదమే వైశ్యులు అయ్యింది.

## వైశ్యులు, శూద్రులు

మళ్ళీ కొద్దిగా వెనక్కి వెళదాం. కొత్తగా వచ్చిన ఆర్యులు యుద్ధాలు చేసి దాస్యులు అనేటటువంటి తమ కంటే పూర్వులైన ఆర్యులను అణచివేసి, దస్యులు అనే ఆర్యేతరులను కూడా అణచివేసి, అందరినీ తమకు సేవ లేదా కూలి చేసే శూద్రులుగా మార్చుకున్నారని చెప్పుకున్నాం కదా! అంటే శూద్రులు అనే వాళ్లలో ఆర్యేతరులు ఉన్నారు, ఆర్యులు ఉన్నారు, అణగారిన వారందరూ ఉన్నారు, వీళ్ళందరూ కూడా యుద్ధాల్లో ఓడిపోయినటువంటి వాళ్ళు. వీళ్ళందరినీ కూడా శూద్రులు అనే పేరుతో విజేతలైన ఆర్యులు తమకు ఉమ్మడి సేవకుల్ని చేసుకున్నారు. ఈ శూద్రులు ఎవరికీ వ్యక్తిగతంగా బానిసలు కాదు, మొత్తంగా ఆర్య గణానికి సేవకులు. వీళ్ళను సేవకులుగా మార్చుకున్న తరువాత వారి చేత పని లేదా సేవ చేయించుకొని ఆర్జించిన సంపదను పంచుకోవటంలో ఆర్యులలో కూడా వర్ణ విభజన వచ్చింది. ఈ సంపదలో ఎక్కువ భాగం బ్రాహ్మణులు, క్షత్రియులు తీసుకున్నారు. రేపు జరగబోయే యుద్ధంలో జయం కావాలని, ఈ రోజు జరిగిన యుద్ధంలో జయం కలిగినందుకు వారు ఇంద్రుడికి, అగ్నికి బ్రహ్మాండమైన యాగాలు చేయిస్తారు. దానిలో భాగంగా బ్రాహ్మణులకు వేలకొలది పశువులు ఇస్తారు. ఉపనిషత్తుల్లో చూస్తే ఆ పశువుల సంఖ్య అసంఖ్యాకంగా ఉంటుంది. అన్ని పశువులను మనం ఊహించుకోలేం కూడా. *(ఇక్కడ కొంత భాగం రికార్డు కాలేదు.)* ఈ క్రమంలో ఈ విశ్, విశ అనే ప్రజల నుండి క్రమంగా వైశ్యులు అనే ఒక మూడో వర్ణం తయారైంది. వైశ్యులు ఎవరు అంటే అప్పటి ఆర్యగణానికి అవసరమైన పని అంతా, అది ఆహార సేకరణ కావచ్చు, పశు పోషణ కావచ్చు, లేక రథాల తయారీ కావొచ్చు – ఆ రోజుల్లో యుద్ధానికి రథాలను ఉపయోగించేవాళ్ళు కాబట్టి ఈ రథకారులనే వాళ్లు వైశ్యులలో చాలా ముఖ్యులని ఋగ్వేదంలో తెలుస్తుంది – ఈ పనులన్నీ వాళ్ళు చేస్తూ ఉండేవాళ్ళు. అందరికీ ఉమ్మడిగా కూలి చేసే వాళ్ళు మాత్రం శూద్రులు. ఆ రకంగా మొట్టమొదటిసారిగా వర్ణ విభజన ఏర్పడింది. ఈ వర్ణ విభజనకు ప్రాచీన కాలంలోనే ఆమోదం ఉందని చెప్పటానికి దాన్ని పురుష సూక్తంలో చేర్చి తీసుకుపోయి ఋగ్వేదంలో పదో మండలంగా పెట్టారు.

ఈ రకంగా ప్రారంభం అయిన వర్ణవ్యవస్థలో కాలక్రమంలో ఏం జరిగింది అంటే – కోశాంబి దీని గురించి చాలా వివరంగా చెప్తాడు. ఆర్యేతర గణాలను గానీ, తమకంటే పూర్వులైన ఆర్య గణాలను గానీ లోబరుచుకున్నప్పుడు నూటికి ఎనభై శాతం మందిని శూద్రులుగా, పది–పదిహేను శాతం మందిని వైశ్యులుగా తమ సామాన్య ప్రజలో

కలుపుకుంటారు. ఆయా గణాలలో ముఖ్యులుగా ఉండేవాళ్ళను మాత్రం బ్రాహ్మణులుగా, క్షత్రియులుగా తమ బ్రాహ్మణులలోను, క్షత్రియులలోను కలుపుకుంటారు. అట్లా తొలినాటి ఆర్య పురోహితులు గానీ, తొలినాటి ఆర్య రాజన్యులు గానీ పరిశుద్ధంగా ఉండిపోలేదు. ఎప్పటికప్పుడు తాము ఎవరితో యుద్ధం చేశారో, ఎవరితో సంఘర్షించారో ఆయా సమూహాలలోని ముఖ్యులను కలుపుకుంటూ పోయారు. వారిలోని పురోహితులను తమలో కలుపుకుంటూ బ్రాహ్మణ వర్ణం విస్తరిస్తూ పోయింది, అదే విధంగా క్షత్రియ వర్ణం, వైశ్య వర్ణం విస్తరిస్తూ పోయింది. కాని అందరి కంటే ఎక్కువగా – నూటికి ఎనభై, ఎనభై ఐదు శాతాన్ని శూద్రులలో కలుపుకుంటూ, వాళ్ళను సేవకులుగా తయారు చేసుకుంటూ పోయారు. ఇలా కలుపుకు పోవడం వల్ల ఏమైందంటే – బ్రాహ్మణులలో తొలినాటి గోత్రాలు పన్నెండు అని చెపుతారు. కాని ఇవ్వాళ ఆరువందలు, ఏడువందలు, ఎనిమిదివందల గోత్రాలు ఉన్నాయి. నిషాద గోత్రం గురించి కోశాంబి ఒక ఉదాహరణ ఇస్తాడు. వేద కాలంలో నిషాదులు అనే వాళ్ళను బ్రాహ్మణులు చాలా అసహ్యమైన, నీచమైనటువంటి ఒక తెగగా భావించారు. వారి దృష్టిలో నిషాదులు శూద్రుల కంటే ఇంకా తక్కువ వాళ్ళు. అంటే మొట్టమొదటి అంటరానివాళ్ళుగా మనకు కనిపించేవాళ్లలో ఈ నిషాదులు ఒకరు. వీరు ఎట్లా వచ్చారు అనేదానికి కూడా ఒక సిద్ధాంతం ఉంది. బ్రాహ్మణ పురుషునికి, శూద్ర స్త్రీకి సంభోగం జరిగితే పుట్టిన వాళ్ళు నిషాదులు అనే సిద్ధాంతం ఆ రోజుల్లో ధర్మశాస్త్రకారులు చేశారు. నిషాదులకు అటువంటి చరిత్ర ఉన్నప్పటికీ నిషాద గోత్రం ఒకటి బ్రాహ్మణులలో ఉంది ఇవ్వాళ. అంటే ఈ నిషాదులు అనేవాళ్లను లోబరుచుకునే క్రమంలో వాళ్లలోని పురోహితులను బ్రాహ్మణులుగా అంగీకరించి వాళ్లకు నిషాద గోత్రం ఇచ్చారన్న మాట. ఇట్లా ఎక్కువమందిని అణచివేస్తూ, కొంతమందిని మాత్రం బ్రాహ్మణులలో, క్షత్రియులలో కలుపుకుంటూ పోయారు.

ఉత్పత్తి వ్యవస్థలో ఏం జరిగిందంటే పశుపోషణ దగ్గర నుంచి ఆహార ఉత్పత్తి, వ్యవసాయం, నాగలి కనుగొనటం, గొడ్డలి కనుగొనటం, చెట్లు నరికి అడవిని సాగు చేయటం, వ్యవసాయం చేయటం ఈ మార్పులన్నీ వచ్చాయి. ఆ విస్తరించే క్రమంలో వచ్చినవే ఋగ్వేదం తరువాత వచ్చినటువంటి యజుర్వేదం, మిగిలిన వేదాలు. ఆ తరువాతి కాలంలో గౌతమ ధర్మసూత్రం, ఆశ్వలాయన ధర్మసూత్రం, గృహసూత్రాలు, శ్రౌత సూత్రాలు ఇవన్నీ వచ్చాయి. ఈ సూత్రాలు వచ్చేటప్పటికి వ్యవసాయం పెరిగింది. వ్యవసాయం ఎప్పుడైతే విస్తరిస్తూ పోయిందో ఆర్య గ్రామాలు క్రమంగా ఏర్పడుతూ వచ్చాయి.

ఈ గ్రామాల్లో బ్రాహ్మణులుంటారు, క్షత్రియులుంటారు, సామాన్య ప్రజలు అని పిలవబడే వైశ్యులు కూడా వ్యవసాయం చేస్తూనో, రకరకాల వృత్తులు చేస్తూనో ఉంటారు. అందరికీ పనులు చేయటానికి లేబరుగా శూద్రులు ఉంటారు. ఇది బానిస వ్యవస్థ ఏమీ కాదు. ఎందుకంటే బానిస వ్యవస్థలో ఎవరి బానిసలు వాళ్ళకుంటారు. అట్లాంటి బానిస వ్యవస్థ కాదు ఇది. శూద్ర వర్ణం, వర్ణ వ్యవస్థ అనేది భారతదేశంలో బానిస వ్యవస్థకు ప్రత్యామ్నాయంగా వచ్చింది. మొట్టమొదట వ్యవసాయం నేర్చుకున్న తరువాత గ్రీసులో, రోమ్‌లో ఏ రకంగానైతే ఇతర దేశాలలో జయించిన వాళ్ళను బానిసలుగా పెట్టుకొని వాళ్ళతో పనులు చేయించుకున్నారో దానికి ప్రత్యామ్నాయంగా వర్ణవ్యవస్థ ద్వారా శూద్రుల చేత ఇక్కడ పని చేయించుకున్నారు. భగవంతుడే మిమ్మల్ని పాదాల నుండి సృష్టించాడని చెప్పారు. పాదాలు ఏం చేస్తాయి, మొత్తం శరీరాన్ని మోస్తాయి, కాబట్టి మీరు మొత్తం అందరికీ సేవ చేయాలి అనే సిద్ధాంతం ద్వారా ఆ వర్గీకరణను నిలబెట్టి వ్యక్తిగత బానిసలుగా కాకుండా, ఉమ్మడి సేవకులుగా వర్ణవ్యవస్థ శూద్రుల చేత పని చేయించుకుంది.

## శూద్ర వర్ణ ఏర్పాటే ఒక ఉత్పత్తి సంబంధం

అంటే చాలా స్పష్టంగా శూద్ర వర్ణము, శూద్ర అనేది ఒక ఉత్పత్తి సంబంధంగా పనిచేసింది. కొందరు ఎందుకు కూలి చేయాలి, కొందరు ఎందుకు పరిపాలించాలి, కొందరు ఎందుకు పౌరోహిత్యం చేయాలి అని ఎవరూ ప్రశ్నించకుండా వర్ణవ్యవస్థ ద్వారా దానిని వ్యవస్థీకరించారు, దానికొక నిర్మాణాత్మకమైన రూపం ఇచ్చారు, పురుషసూక్తం ద్వారా దానికొక భావజాలాన్ని ఇచ్చారు. కాబట్టి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనేటటువంటి ఆ వర్ణవ్యవస్థలో శూద్ర వర్ణం స్థానాన్ని స్పష్టంగా ఒక ఉత్పత్తి సంబంధంగానే చూడాలి.

దీని తరువాత కాలంలో వేదాలను వివరించేటటువంటి సాహిత్యం ఉంది. బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు అంటారు. ఆ బ్రాహ్మణాలలో స్పష్టంగా చెప్తారు. వైశ్యుడనేవాడు ఇతరులకు భోజ్యుడు అని. వైశ్యుడిని భుజిస్తారని. ఏమిటి భుజించటం అంటే క్షత్రియులు అయిన వాళ్ళు పన్ను వసూలు చేసుకుంటారని. పన్ను వసూలు చేయటమే భుజించటం. పన్నుల రూపంలో వైశ్యుల దగ్గర నుంచి క్షత్రియులు అదనపు ఉత్పత్తిని తీసుకుంటారు, ఆ తర్వాత క్షత్రియులు, బ్రాహ్మణులు కలిసి దాన్ని పంచుకుంటారు.

కాబట్టి వైశ్యులెవరు అంటే భుజింపబడే వాళ్ళు అని ఐతరేయ బ్రాహ్మణంలో చెప్తారు. ఎవరి చేత భుజింపబడే వాడు? క్షత్రియుడి చేత, బ్రాహ్మణుడి చేత భుజింపబడే వాడు. ఏ రూపంలో భుజింపబడే వాడు అంటే పన్ను రూపంలో భుజింపబడే వాడు. సంస్కృతంలో పన్ను అనే దానికి మొట్టమొదటి మాట 'బలి' అని. తరువాత వేరే మాటలు వచ్చాయి. 'బలి' అనేది ఎక్కడనుండి వచ్చింది? యాగాలు, యజ్ఞాలు చేసినప్పుడు దేవుళ్ళకు బలి ఇస్తారు. ఆ బలిచ్చిన దాంట్లో ఒక భాగాన్ని పురోహితుడికి ఇస్తారు. అదే పన్ను వ్యవస్థగా మారింది. కాలక్రమంలో దాన్నే వైశ్యులు అయిన వాళ్ళు, అంటే వ్యవసాయం చేసే వాళ్ళు, పశుపోషణ చేసేవాళ్ళు క్షత్రియులకు, బ్రాహ్మణులకు సమర్పించారు. ఆ బలి అనే మాటే పన్నుకు కూడా వచ్చింది. అంటే ఆ చారిత్రక క్రమాన్ని ఈ మాట సూచిస్తుంది. తరువాత కాలంలో బలి అనే మాటకు పన్ను అనే అర్థం పోయి, యజ్ఞాలలో, యాగాలలో, పూజలలో ఇచ్చే 'బలి' అనే అర్థం వచ్చింది. అట్లా వైశ్యుడు భుజింపబడే వాడు అయ్యాడు. మరి ఈ శూద్రుడు ఎవడు? 'యథాకామ వధ్యుడు' అనే మాట ఒక బ్రాహ్మణంలో ఉన్నది. యథాకామ వధ్యుడు అంటే ఇష్టానుసారం చంపతగ్గవాడు అని. అయితే వధ్యుడు అంటే చంపతగ్గవాడు అనేది ఆనాటి సంస్కృతం అర్థం కాదు, ఆ నాడు వధ్యుడు అంటే కొట్టదగ్గవాడు, తన్నదగ్గవాడు మాత్రమే అని తరువాత ఒక వ్యాఖ్యానం ఉంది. అది వాస్తవం కావచ్చు. మొత్తానికి, పై వర్ణాలవారు ఇష్టానుసారం దెబ్బలు కొట్టగల వాడు శూద్రుడు అనేది వైదిక సాహిత్యంలో వివరిస్తారు.

ఇక్కడ ముఖ్యమైన విషయం ఏమిటంటే వేరే దేశాల్లో కూలి వాళ్ళను, కార్మికులను ఇష్టానుసారం కొట్టలేదా అంటే కొట్టారు. కానీ ఇష్టానుసారం కొట్టదగ్గవాడు శూద్రుడు అని వైదిక సాహిత్యంలో చెప్పి, దీనికి ఆమోదం వేదాల నుంచే వచ్చిందని చెప్పటం, ఆ ప్రత్యేకమైన లక్షణం వర్ణవ్యవస్థలోనే కనిపిస్తుంది. బైబిల్లో ఎక్కడా చెప్పలేదు, ఖురాన్‌లో ఎక్కడా చెప్పలేదు, బౌద్ధ గ్రంథాల్లో ఎక్కడా చెప్పలేదు. క్రైస్తవ దేశాల్లో, ఇస్లామిక్ దేశాల్లో, బౌద్ధ దేశాల్లో కూలి వాళ్ళను తిడుతున్నారు, తంతున్నారు, చంపుతున్నారు నిజమే. కాని ఒక్క భారతీయ హైందవ సంస్కృతిలో మాత్రమే శూద్రుడంటే యథాకామ వధ్యుడు అని రాశారు. ఆ మాట ఎవరో ఒక దుర్మార్గుడు చెప్పలేదు, ఎవడో ఒక పెట్టుబడిదారుడు చెప్పలేదు; వైదిక గ్రంథాల్లో చెప్పారు, ఐతరేయ బ్రాహ్మణంలో చెప్పారు, శతపథ బ్రాహ్మణంలో చెప్పారు. ఐతరేయ బ్రాహ్మణం అంటే ఏమిటి? ఋగ్వేదాన్ని, యజుర్వేదాన్ని, అధర్వణ వేదాన్ని వ్యాఖ్యానించే గ్రంథం. ఋగ్వేదంలో, యజుర్వేదంలో, అధర్వణ వేదంలో

చెప్పినటువంటి యజ్ఞకాండను ఏ రకంగా నిర్వహించాలో వివరించే గ్రంథం. ఆ గ్రంథంలోనే ఈ మాట చెప్పారు అంటే, అది వర్ణధర్మానికుండే లక్షణం. అట్లా కూలివాళ్ళుగా, శ్రామికులుగా, సమిష్టి సేవకులుగా పెట్టుకొని కొట్టి తన్ని పని చేయించుకోగలిగిన వాళ్ళు శూద్రులు. వైశ్యులెవరు? వ్యవసాయం చూసుకొని, పశుపోషణ చూసుకొని, పన్ను రూపంలో బలి ఇచ్చేవాళ్ళు – వాళ్ళు భోజ్యులు. భుజించే వాళ్ళు ఎవరంటే క్షత్రియులు, బ్రాహ్మణులు.

## ఎన్ని వక్ర ఆలోచనలో!

పౌర ప్రతిపత్తిలో అసమానతలనేది పెట్టుబడిదారీ పూర్వ సమాజాల్లోని అన్ని దేశాల్లో ఉన్నప్పటికీ – జపాన్‌లో, చైనాలో, ఈజిప్టులో, పశ్చిమ ఆసియా తదితర అనేక దేశాల్లో ఉన్నప్పటికీ – దానికి సంపూర్ణమైన, సమగ్రమైన రూపం ఇచ్చింది మాత్రం భారతదేశంలోని కులవ్యవస్థ ఒక్కటేనని ఇప్పటికే చెప్పుకున్నాం కదా! పౌర ప్రతిపత్తిలో అసమానత అనే దాన్ని ధర్మశాస్త్రాలలో ఎన్ని రూపాల్లో రాశారు అంటే – అసలు వాళ్లకు అంత వక్రమైన ఆలోచనలు ఎక్కడనుండి వచ్చాయని ఆశ్చర్యమనిపిస్తుంది. వాడు కూర్చుని ఆలోచించి అలోచించి ఎక్కడెక్కడ సమానత్వం ఉండొచ్చో చూసి అక్కడ అక్కడ అసమానతను పెడతాడు. అంత లోతుగా ఆలోచించి ప్రతి ఒక్క చిన్న విషయం, పెద్ద విషయం, తిండి, బట్ట, ఏ రకంగా పలకరించాలి, ఒంట్లో బాగుందా అని ఏ రకంగా అడగాలి, దండం ఏ రకంగా పెట్టాలి, కూర్చునేటప్పుడు కుర్చీలు ఎక్కడ వెయ్యాలి అనే దగ్గర మొదలు పెట్టి ఎంతో వివరంగా చెప్తారు. అంబేడ్కర్ పుస్తకాలు చదివితే అందులో ఆయన చాలా ఉదాహరణలు ఇస్తాడు. ఆర్.ఎస్. శర్మ, కోశాంబి కూడా చాలా ఉదాహరణలు ఇస్తారు. మనం ఆ వివరాల్లోకి ఇప్పుడు పోనవసరం లేదు కాని ధర్మశాస్త్రాలలో వాటి గురించి చాలా విపులంగా రాసి పెట్టారు.

అంతే కాదు, శూద్రుడు ఏ రకమైన బట్టలు వేసుకోవాలో కూడా చెప్పారు. వాళ్ళు ఉమ్మడి సేవకులు కదా, కాబట్టి వీళ్ళు వాళ్ళకు ఇవ్వాలంటే ఏం బట్టలు ఇవ్వాలి, మంచి పాత బట్టలు కూడా కాదు, చినిగిపోయిన బట్టలే ఇవ్వాలంట. నువ్వు వేస్కొని పాతబడిపోయిన బట్టలు సేవకుడికి ఇవ్వు అని చెప్పడం కాదు, చినిగిపోయినవే ఇవ్వాలంట. పూర్తిగా మురికై పోయినవే ఇవ్వాలంట. పాత్రలు కూడా చిల్లుపడిపోయిన పాత్రలు, పగిలిపోయిన కుండపెంకులే ఇవ్వాలంట. మంచి కుండ కూడా ఇవ్వకూడదు. నువ్వు

పది కుండలు కొనుక్కున్నా ఒక్క కుండ కూడా నీ కూలి వాడికి ఇవ్వకూడదంట. పగిలిపోయిన కుండ పెంకులే ఇవ్వాలంట. అంత సంపూర్ణంగా పౌర సమానత్వాన్ని తిరస్కరిస్తూ ధర్మశాస్త్రాల్లో ఒకదాని తరువాత ఒకటి రాసుకుంటూ వచ్చారు. ఆ దశలో వచ్చిన అన్ని ధర్మశాస్త్రాలలోకీ మనువు రాసినది ఘోరమైనది. అది తరువాత వచ్చినా అత్యంత కఠినమైనది. అట్లా రాసుకుంటూ వచ్చారు వాళ్ళు.

## వ్యవసాయం-అదనపు ఉత్పత్తి-శ్రమ దోపిడీ

శూద్రుల చేత సేవలు చేయించుకుంటూ, వైశ్యుల చేత వ్యవసాయం చేయిస్తూ, పశుపోషణ చేయిస్తూ ఉన్నటువంటి ఈ దశలో వ్యవసాయం విస్తరించింది కాబట్టి సంపద పెరిగింది. ఉత్పత్తిలో పశుపోషణకు, వ్యవసాయానికి దాదాపు పదిరెట్ల వరకు తేడా ఉంది. ఒక పశుపోషక సమాజం వంద మందిని పోషించగలిగితే వ్యవసాయక సమాజం వెయ్యి మందిని పోషించగలుగుతుంది. అంత మిగులు ఉత్పత్తి వస్తుంది వ్యవసాయంలో. మిగులు ఉత్పత్తి ఉందని వెంటనే వెయ్యి మంది రారు. పోనీ ఆ వంద మంది ఆ సంపదను సమానంగా పంచుకుంటే అందరూ బాగా బతకొచ్చు. అట్లా కాకుండా బ్రాహ్మణులు, క్షత్రియులు మొత్తం ఆ మిగులు ఉత్పత్తిని, అంటే తొమ్మిది వందల మంది తిండిని తీసుకున్నారు అని అర్థం చేసుకుంటేనే వర్ణవ్యవస్థ శ్రమ దోపిడీకి ఎంతగా ఉపయోగపడిందో మనకు అర్థమవుతుంది. ఎంత సంపదను వాళ్ళు సంపాదించుకున్నారనేది అర్థమవుతుంది. యాగం చేసి యాభైవేల పశువులు ఇచ్చాడు అని ఉపనిషత్తులలో రాస్తారు. నిజంగా యాభైవేలు ఇచ్చి ఉండకపోవచ్చు, యాభై వేలు ఇచ్చాడు అని రాస్తే రేపు ఇచ్చేవాడు ఇంకా ఎక్కువ ఇస్తాడని బ్రాహ్మణులు అలా కూడా రాసి ఉండొచ్చు. వాస్తవం ఏది అయినప్పటికీ చాలా ఇచ్చాడదన్నది మాత్రం మనకు అర్థమవుతుంది. పెద్దఎత్తున పశువులు, పెద్దఎత్తున కుండలు, కుండలు కుండలు పాలు, పెరుగు ఇవన్నీ ఇచ్చారని తెలుసు. ఇట్లా సంపాదనను తీసుకుంటూ, పశువులను నరికి తింటూ ఉండేవారు పై రెండు వర్ణాల వాళ్ళు. ఇంటికి ఎవరైనా బ్రాహ్మణుడు లేదా అగ్రవర్ణంవాడు అతిథిగా వస్తే, లేకపోతే ఏదైనా ఒక కర్మకాండ, ఒక పెళ్లి, ఒక పుట్టినరోజు పండుగ లాంటివి జరిగితే వారికి ఆ గృహస్థు మధుపర్కం ఇవ్వాలి. ఇప్పటికీ బ్రాహ్మణుల ఇళ్ళల్లో ఇస్తూ ఉంటారు. ఇప్పుడు ఆ మధుపర్కం అనే దాంట్లో తేనె, నెయ్యి ఏదో కలిపి ఇస్తున్నారు కాని ఒకనాడు ఆవు మాంసం ఉంటేనే మధుపర్కం. లేకపోతే మధుపర్కమే కాదు ఆ రోజులలో.

అయితే ఇట్లా ఇంటికి వచ్చిన ప్రతి బ్రాహ్మణుడికీ ఆవు మాంసం ఇస్తుంటే వారికి ఆవులు మిగిలేటట్లు కనబడలేదు. ఒకవేళ ఆవుల్ని అతను వదిలిపెట్టేసి ఉంటే నువ్వు గొఱ్ఱెమాంసం ఇవ్వచ్చు, మేకమాంసం ఇవ్వచ్చు అని ఒక వెసులుబాటు కూడా పెట్టారు. వదిలిపెట్టేసి ఉంటే అనేది ధర్మశాస్త్రాలలో మళ్ళీ మళ్ళీ రాయడానికి అర్థమేమిటంటే బ్రాహ్మణులు వస్తున్నారని తెలిస్తే వైశ్యులు పశువులను బయటకు తోలేసేవాళ్ళు అంట. అందుకని ధర్మశాస్త్రాల్లోని గృహసూత్రాల్లో ఏం రాశారంటే, ఒకవేళ వాటిని నువ్వు కట్లు విప్పి బయటకు తోలేసి ఉంటే నువ్వు గొర్రె మాంసం అయినా పెట్టాలి మధుపర్కంలో అని నియమం పెట్టారు. దీనికి సహజంగానే వైశ్యుల్లో వ్యతిరేకత వచ్చింది. తమ పశు సంపద, వ్యవసాయానికి పనికొచ్చే సంపదంతా వీళ్ళ యాగాలకు, వీళ్ళ తిండికి, వీళ్ళ ఆర్భాటాలకు పోతూ ఉంటే వ్యతిరేకత రావడం సహజమే కదా! ఇది ఒక వైపు.

## బ్రాహ్మణ-క్షత్రియ ఘర్షణ: బౌద్ధ, జైన మత ఆవిర్భావాలు

ఇంకొక వైపు బ్రాహ్మణులు తమ ఆధిక్యతను క్షత్రియుల మీద కూడా చాలా పెద్దఎత్తున ప్రయోగించటం మొదలుపెట్టారు. బ్రాహ్మణులకు, క్షత్రియులకు మొట్టమొదట తేడా ఎక్కడ వచ్చిందంటే అంటే ఈ పంచుకోవటం దగ్గర వచ్చింది. వేద మంత్రాలు చదివేటటువంటి ఏకైక హక్కు నాకే ఉంది, దేవుడితో నేరుగా మాట్లాడే టెలిఫోన్ లింక్ నాకే ఉంది, మీకెవరికీ లేదు అని చెప్పి బెదిరించి క్షత్రియులపైన కూడా తమ ఆధిక్యతను నెలకొల్పే ప్రయత్నం ఈ బ్రాహ్మణ వర్ణం చేసింది. క్షత్రియులలో కూడా సహజంగానే resentment వచ్చింది. ఆ నిరసనను వ్యక్తం చేయటానికి కావలసినటువంటి బలం కూడా వాళ్లకు ఉంది. ఇదొక సంఘర్షణగా ముందుకొచ్చింది. ఈ బ్రాహ్మణ క్షత్రియ సంఘర్షణను విశ్వామిత్రుడు-వశిష్టుడి సంఘర్షణగా బహుశా మీరు పుస్తకాల్లో చదివే ఉంటారు కాబట్టి నేను ఆ వివరాల్లోకి పోను. క్షత్రియుడినై ఉండి కూడా నేను బ్రాహ్మణుడిని అవుతాను, అంటే నేను వైదిక కర్మకాండ నిర్వహిస్తాను, నేను బ్రహ్మర్షి అవుతాను అని విశ్వామిత్రుడు ప్రయత్నం చేయటం, త్రిశంకువు కోసం స్వర్గాన్ని నిర్మించేందుకు ప్రయత్నం చేయటం, బ్రాహ్మణులు దాన్ని ఎదుర్కోవటం, ఇదంతా కూడా పెద్ద సంఘర్షణగా సాగుతుంది. ఈ క్రమంలోనే బ్రాహ్మణేతర మతాలు, బ్రాహ్మణేతర సిద్ధాంతాలు సమాజంలో పుట్టాయి. వాటిలో ముఖ్యమైనది బౌద్ధ మతం. బౌద్ధమతాన్ని ఏ రకంగా అర్థం చేసుకోవాలన్న దానిలో నిజానికి ఏకీభావం లేదు చరిత్రకారులలో. దాన్ని క్షత్రియులకు బ్రాహ్మణులకు

మధ్య వచ్చిన సంఘర్షణగా, క్షత్రియుల యొక్క ఆధిక్యత నిలబెట్టటం కోసం వచ్చిన మతంగా ఒక అభిప్రాయం ఉంది. జైన మతం గురించి కూడా అటువంటి అభిప్రాయమే ఉంది. తొలినాడు జైనులైతే దాదాపు అందరూ క్షత్రియులే. బౌద్ధులందరూ క్షత్రియులు కాదు, ఆ మతంలో వేరేవాళ్లు కూడా చాలామంది ఉన్నారు. కానీ ప్రధానంగా క్షత్రియులే అని చెప్పాలి. ఆ ఘర్షణలో భాగంగానే బ్రాహ్మణుల మీద క్షత్రియాధిక్యతను నిలబెట్టటం కోసం బౌద్ధమతం వచ్చింది అనే అభిప్రాయం ఒకటుంది.

అయితే దీన్ని ఇంకొంచం సమగ్రంగా అర్థం చేసుకునే ప్రయత్నం చేద్దాం. దీన్ని ఎట్లా చూడొచ్చంటే అప్పుడే వ్యవసాయక సమాజం నూతనంగా ఆవిర్భవిస్తోంది. అప్పటికి భూమి ఇంకా సొంత ఆస్తి కాదు, మొత్తం గణం యొక్క సమిష్టి ఆస్తే. ఒక గ్రామం ఉందంటే ఆ గ్రామంలో అందరూ ఉంటారు, బ్రాహ్మణులుంటారు, క్షత్రియులుంటారు, వైశ్యులు ఉంటారు. భూమి అందరి సమిష్టి ఆస్తి. కాని వైశ్యులు దాని నిర్వహణ చూసుకుంటూ ఉంటారు. బ్రాహ్మణులు, క్షత్రియులు అనుభవిస్తూ ఉంటారు, శూద్రులు సేవ చేస్తూ ఉంటారు. నూతనంగా పుట్టిన ఈ వ్యవసాయక వర్గ సమాజాన్ని, ఈ సంబంధాన్ని ఏ రూపంలో వ్యవస్థీకరించాలి, ఏ రకమైన నిర్మాణం దీనికి సరైనది, ఏ రకమైన భావజాలం, ఏ రకమైన సిద్ధాంతం, ఏ రకమైన తాత్విక దృక్పథం, ప్రాపంచిక దృక్పథం దీనికి సరైనది అనే సంఘర్షణ ఆ దశలో రావటం చాలా సహజం. అట్లా చూసినప్పుడు బౌద్ధాన్ని బ్రాహ్మణ వర్ణధర్మానికి ప్రత్యామ్నాయమైన ఒక నిర్మాణ సూత్రంగా, నిర్మాణ సిద్ధాంతంగా, ప్రాపంచిక దృక్పథంగా అర్థం చేసుకోవచ్చు. కేవలం క్షత్రియ బ్రాహ్మణ సంఘర్షణగా కాకుండా ఒక ప్రత్యామ్నాయంగా చూడవచ్చు. వర్గ సమాజాన్ని బుద్ధుడు కాదనలేదు ఎప్పుడు కూడా. వర్గ సమాజం అంటే కొంతమంది భూమి లేని వాళ్ళు ఉంటారు, కొంతమంది భూమి అనుభవించే వాళ్ళు ఉంటారు, కొంతమంది కూలి చేసే వాళ్ళు ఉంటారు, కొంతమంది వారి శ్రమను అనుభవించే వాళ్ళు ఉంటారు. దాన్ని బుద్ధుడు కాదనలేదు. కాని ఈ నూతన సమాజాన్ని వర్ణవ్యవస్థ లాగ వర్గీకరించేసి, నీ ధర్మం ఇదే, నువ్వు ఇదే చేయాలి అని కాకుండా ఇంకొంచం ప్రజాస్వామికంగా దాన్ని ఏ రకంగా వ్యవస్థీకరించవచ్చు, ఇంకొంచం హ్యూమనిస్టిక్‌గా దాన్ని ఏ రకంగా వ్యవస్థీకరించవచ్చు అనేటటువంటి ఆలోచన మనకు బౌద్ధ మతంలో కనిపిస్తుంది. అట్లా కొత్తగా పుట్టినటువంటి వర్గ సమాజానికి వర్ణవ్యవస్థ కాకుండా ఒక ప్రత్యామ్నాయ నిర్మాణ సూత్రం (alternative form of organisation) ఇవ్వడానికి ప్రయత్నించిన మతంగా

మనం బౌద్ధాన్ని గనుక అర్థం చేసుకుంటే అది చారిత్రకంగా ఇంకొంచం కరెక్టుగా ఉంటుంది. దాంట్లో క్షత్రియ, బ్రాహ్మణ సంఘర్షణ ఉంది, లేదని కాదు. అయితే ఇది ఇంకా కరెక్టుగా ఉంటుందనేది నా అభిప్రాయం. కొంతమంది చరిత్రకారులు కూడా దాదాపు ఇదే రకంగా చెప్తారు.

## మోక్షంలో సమానత్వం కల్పించింది బౌద్ధమే

బుద్ధుడు ఒక విషయంలో అందరికీ సమాన ప్రతిపత్తి కల్పించాడు. అప్పటికున్నట్టి వర్ణధర్మం ఏం చెప్పింది? శూద్రునికి మోక్షం ప్రసక్తే లేదు అంది. వాడు ఆదిపురుషుడి పాదాల నుంచి పుట్టాడు, వాడు సేవ చేయవలసిందే అంది. అక్కడికి ఫుల్‌స్టాప్. మిగిలిన వాళ్లకు కూడా మోక్షం అనేది బ్రాహ్మణుడి ద్వారా రావలసిందే. నేరుగా దేవుడితో సంభాషించడానికి గానీ, యజ్ఞాలు చేయడానికి గానీ, కర్మకాండ నిర్వహించడానికి గానీ బ్రాహ్మణుడికి మాత్రమే హక్కు ఉంటుంది. మోక్షం పొందటానికి అవసరమైనటువంటి నిత్యజీవిత సంస్కారాలు, కర్మకాండ నిర్వహణ, దానికి కావలసిన హక్కు వర్ణధర్మం ప్రకారం శూద్రునికి లేనే లేదు. గృహసూత్రాలని ఉంటాయి. అవి ఏం చెప్తాయి అంటే నిత్యజీవిత గృహ సంస్కారాలు ఏ రకంగా చేయాలనేది చెప్తాయి. బ్రాహ్మణుడికి గృహసూత్రాలు ఉంటాయి, క్షత్రియులకు గృహసూత్రాలు ఉంటాయి, వైశ్యులకు కూడా ఉంటాయి. కానీ శూద్రులకు గృహసూత్రాలు లేవు. ఎప్పటిదాకా లేవు అంటే క్రీస్తు పూర్వం దాటి, క్రీస్తు శకానికి వచ్చి, గుప్త రాజుల కాలం కూడా దాటి శూద్రుల్లో కొంతమంది భూమి బాగా సంపాదించుకొని సత్–శూద్రులుగా, అంటే ఇవాళ్టి మన కమ్మ, రెడ్డి, వెలమ వంటి కులాల పూర్వీకులు వచ్చిన తరువాతే మొట్టమొదటిసారిగా బ్రాహ్మణులు శూద్రులకు కూడా గృహసూత్రాలు రాశారు. కాని మోక్షం పొందటానికి గానీ, నిర్వాణం పొందటానికి గానీ, పరమాత్మునిలో లీనం కావటానికి గానీ వర్ణంతో ఏమీ సంబంధం లేని ఒక సమానమైన ప్రతిపత్తి కల్పించటం బౌద్ధ మతంలో ఉన్న ముఖ్యమైన లక్షణం. ఇది కేవలం క్షత్రియ బ్రాహ్మణ సంఘర్షణ కాదు. ఇది మొత్తం సమాజానికి సంబంధించిన విషయం.

బుద్ధుడు నిజానికి నిత్య దైనందిన జీవితంలో, ఆర్థిక జీవితంలో సమానత్వం గురించి మాట్లాడలేదు. కాని ఒకటి – మోక్షం, ముక్తి, నిర్వాణం అనే విషయంలో సమాన అవకాశం కల్పించాలని చెప్పాడు. రెండు – నిత్య జీవిత, సాంఘిక, ఆర్థిక జీవితంలో మొబిలిటీకి కొంత అవకాశం ఉండాలని చెప్పాడు. పుట్టావు కాబట్టి నువ్వింతే, నీ పిల్లలింతే అని

కాకుండా సమాజంలో మొబిలిటీ కొంత ఉండాలి. పైకి పోయే అవకాశం కొంత ఉండాలి. దాసులు ఆర్యులు కావచ్చు, ఆర్యులు దాసులు కావచ్చు అనేటటువంటి అవకాశం ఉండాలి అని చెప్పాడు. మూడవది – ఇంకా చాలా ఆధునికమైనటువంటి ఒక సంక్షేమ దృక్పథం కూడా బుద్ధుడిలో ఉండింది. ఆస్తులు ఉండేవాళ్లు సంపాదించేది కేవలం వారి కోసమే కాదు, వారి భృత్యుల కోసం కూడా, ఆ విధంగా ఆలోచించాలని చెప్పాడు. ఇప్పుడు ఆలోచిస్తే ఇదొక సంక్షేమ భావనగా మనకు కనిపిస్తుంది. అది సమానత్వం కాకపోవచ్చు కాని బడుగు వర్గాల సంక్షేమం కోసం ఆ నాడే ఆలోచించాడు కదా! నువ్వు సంపాదించేది కేవలం నీ కోసం అనుకోవద్దు, నీ భృత్యుల కోసం కూడా నువ్వు సంపాదిస్తున్నావని అనుకో. వారిని తిట్టొద్దు, కొట్టొద్దు, మర్యాదగా చూడు, మంచి చేసుకొని పని చేయించుకో అనే సూత్రాలు, అంటే వర్గ సమాజాన్ని కొంత మానవీయంగా వ్యవస్థీకరించే ప్రయత్నం మనకు బౌద్ధ ప్రాపంచిక దృక్పథంలో కనిపిస్తుంది. మోక్షం దగ్గరికి, ముక్తి దగ్గరకి వచ్చేటప్పటికి మాత్రం సమాన ప్రతిపత్తి, సమాన అవకాశాలు కల్పించే ప్రయత్నం చేస్తాడు.

అయితే బుద్ధుడు కూడా బానిసలకు గానీ, బాకీ పడి దాన్ని తీర్చలేక దివాలా (insolvent) తీసిన వాళ్లకు గానీ బుద్ధ సంఘాలలో స్థానం ఇవ్వడు. అంటే ఈ వర్గ సమాజం నుంచి తప్పించుకొని పారిపోయి దాంట్లో చేరాలని ప్రయత్నం చేసిన వాళ్లకు స్థానం కల్పించడు. యజమానికి చెప్పకుండా పారిపోయి వచ్చిన బానిస బుద్ధ సంఘంలో చేరటానికి వీలు లేదు. ఆ యజమాని ఆస్తివే నువ్వు. అట్లాగే నువ్వు బాకీపడినవాడివి కాబట్టి బాకీ మొత్తం తీర్చాలి, అది తీర్చకుండా నువ్వు పారిపోయి సంఘంలో చేరుతాను అంటే చేర్చుకోనని కూడా అంటాడు. అంటే వర్గ సమాజాన్ని అక్కడ బుద్ధుడు కూడా ఆమోదిస్తాడు. కాని మొత్తానికి బ్రాహ్మణ వర్ణధర్మం ఎట్లైతే నూతనంగా పుట్టిన వ్యవసాయక వర్గ సమాజానికి ఒక నిర్మాణ సూత్రంగా ముందుకొచ్చిందో, దానికొక ప్రత్యామ్నాయ సూత్రంగా బౌద్ధాన్ని అర్థం చేసుకుంటే, చాలా మానవీయత, ప్రజాస్వామ్య దృక్పథం మనకు బౌద్ధ మతంలో కనిపిస్తుంది.

సరే ఈ సంఘర్షణ చాలాకాలం సాగింది. ఇది జరుగుతున్న సమయంలోనే మౌర్య సామ్రాజ్యం వచ్చింది. అప్పటికి ఇనుము వాడకం బాగా పెరిగింది. చరిత్రకారులు ఆర్.ఎస్. శర్మ ఈ విషయం వివరంగా చెప్తారు. ముఖ్యంగా ఆయన పుస్తకాలు రెండు మనకు

చాలా ఉపయోగపడతాయి. 1. Material Culture and Socio-Economic formation in Ancient India, 2. Sudras in Ancient India. రెండోది తెలుగులోకి కూడా అనువాదం అయినట్టుంది. మొదటిది కాలేదు. వేదకాలం తరువాత వ్యవసాయక వర్గ సమాజం ఏర్పడుతున్న దశలో బ్రహ్మాండమైన ఉత్పత్తి ఏమీ జరగలేదు అని చెప్పడానికి ఆయన ఒక ఉదాహరణ చూపుతారు. పురావస్తు అవశేషాల్లో భాగంగా మనకు కుండ పెంకులు కనిపించిన చోట పెద్దగా సంపద ఏమీ దొరకలేదని చెప్తారు ఆయన. అవన్నీ బూడిద రంగు కుండ పెంకులు. తరువాత దశలో బాగా పాలిష్ చేసినటువంటి నల్ల కుండ పెంకులున్న ఆవాసాలు కొన్నిటిని కనుగొన్నారు. అక్కడ చాలా రకాల సంపద కనిపిస్తుంది. బంగారు ఆభరణాల ముక్కలు కనిపిస్తాయి, గాజు ముక్కలు కనిపిస్తాయి, రకరకాల ఇనుప పనిముట్ల ముక్కలు కనిపిస్తాయి. ఈ దశలో ఇనుము వాడకం బాగా పెరిగిందనేది అర్థమవుతుంది. దాంతో అడవులు నరికి వ్యవసాయాన్ని బాగా విస్తరించే అవకాశం అనేది క్రమంగా సమాజంలో పెరిగింది.

## వైశ్యుల నుండి శూద్రులకు మారిన వ్యవసాయం

పెరిగి ఏం జరిగింది? అర్థశాస్త్రంలో కౌటిల్యుడు బ్రాహ్మణ వర్ణధర్మం అంతా మళ్ళీ చెప్తూ అదనంగా ఏం చెప్పాడంటే రాజు అడవులను నరికి గ్రామాలను నెలకొల్పే అవకాశం శూద్రులకు ఇవ్వాలి అని. ఇదొక కొత్త మార్పు. అంటే శూద్రుల చేత అడవులను నరికించి గ్రామాలు నెలకొల్పే ప్రయోగం రాజులు చేయాలని చెప్పాడు. దాంతో ఏమైంది? అంతవరకు కేవలం కూలివాళ్ళుగా ఉన్న శూద్రులు మొదటిసారిగా ప్రభుత్వానికి కౌలుదార్లు అయ్యారు. సొంత ఆస్తిపరులు కాదు, ప్రభుత్వానికి కౌలుదారులుగా మారారు. అంటే శూద్ర వర్ణం కూలివాళ్ళ స్థాయి నుండి ఒక అడుగు ముందుకుపోయి ప్రభుత్వానికి అర్ధ సీతకులు అయ్యారు. కౌలుదార్ల అప్పటి పేరు అది. సీత అనే మాటకు భూమి అని అర్థం. సీతా అని దీర్ఘం ఇస్తే భూమిలో పుట్టినది అని. సీత రాముడి భార్య. మనం తెలుగులో సీత అని హ్రస్వంగా రాస్తాము. సీత అంటే భూమి కాబట్టి అర్ధసీతకులు అంటే కౌలుదార్లు, ప్రభుత్వానికి కౌలుదార్లు. అట్లా శూద్రుల స్థితిలో కొంచెం మార్పు వచ్చింది. ఇనుము వాడకం బాగా విస్తరించి, గొడ్డలి, నాగలి వంటి రకరకాల ఇనుప పనిముట్లు తయారు చేసుకోగలిగిన సామర్థ్యం, అడవులను విస్తారంగా నరికి వ్యవసాయ యోగ్యం చేసే అవకాశం వచ్చినప్పుడు మాత్రమే అది సాధ్యమైంది. అంతే కాదు, మౌర్య సామ్రాజ్యం దాన్ని State Enterprise గా ఎప్పుడైతే అమలు చేయడం మొదలుపెట్టిందో శూద్రుల స్థితి కొంచం

మెరుగుపడటం కనిపిస్తుంది. అదే సమయంలో మౌర్య చక్రవర్తి అశోకుడు బౌద్ధ ధర్మాన్ని స్వీకరించడం వల్ల శూద్రులకు కొంత మెరుగైన స్థితి ఇవ్వడం పట్ల ఆయనకు అభ్యంతరం లేకపోయింది. ఆ విధంగా ఇది సాధ్యమయింది.

క్రీస్తు పూర్వం నుండి క్రీస్తు శకానికి వస్తే, భారతదేశంలో మొట్టమొదటిసారిగా చాలా పెద్దఎత్తున వృత్తి పనులు, వృత్తి కళలు విస్తరించటం కనిపిస్తుంది. వేద కాలం నుంచి మన దగ్గర రథాలు తయారు చేసేవాళ్ళు, చర్మం పని చేసేవాళ్ళు రకరకాల వృత్తులవారు ఉన్నారు. ఆ వృత్తులు బాగా విస్తరించడంతోపాటు ఇప్పుడు మరెన్నో కొత్త వృత్తులు వచ్చి చేరాయి. ఇనుప పనులు, రకరకాల ఆభరణాల పనులు, ఉక్కు ఉత్పత్తి చేయటం, ఎగుమతి చేయటం ఇవన్నీ మొదలయ్యాయి. ఎందుకంటే అప్పటికి గ్రీస్, రోమ్ దేశాల వాళ్ళు మొదటిసారిగా సముద్రయానం మార్గం ఒకటి భారతదేశానికి కనుగొన్నారు. వాళ్ళు భారతదేశానికి రావటం, ఇక్కడి వ్యాపారస్తులు అక్కడికి పోవటం, ఎగుమతులు బాగా పెరగడం – దీనితో మొట్టమొదటిసారిగా శూద్రుల వృత్తులుగా ఉన్నటువంటి వృత్తి పనులకు గిరాకీ బాగా పెరిగింది. దానితో శూద్రుల వృత్తిపనుల శ్రేణులు కూడా బాగా పెరిగాయి. ఇది ఒక వైపు జరిగింది. ఇంకొక వైపు, ఇంతకు ముందు చెప్పినట్టుగా వ్యవసాయ విస్తరణ క్రమంగా జరుగుతూ పోయి, అప్పటిదాకా వర్ణధర్మం లేని దక్షిణ భారతదేశానికి కూడా వ్యవసాయం విస్తరించడం, శాతవాహన రాజ్యం ఏర్పడటం మొదలయ్యేటప్పటికి ఏమయ్యిందంటే, కూలివాళ్ళుగా ఉన్న శూద్రులు కాలక్రమంలో రైతులుగా మారేటటువంటి, వ్యవసాయదారులుగా మారేటటువంటి పరిస్థితులు వచ్చాయి. వృత్తులకు గౌరవం పెరగటం, వృత్తి శ్రేణుల వద్ద డబ్బు పెరగటం, వృత్తులలో ఉన్నటువంటి వాళ్ళకు గౌరవం పెరగటం ఇది మనకు ఒక చారిత్రక క్రమంగా ఉత్పత్తి వ్యవస్థలో కనిపిస్తుంది.

అంతవరకు వైశ్యులు మాత్రమే వ్యవసాయం చేయాలి, వైశ్యులు మాత్రమే వ్యాపారం చేయాలి అని ఉండేది కదా! ఇప్పుడు శూద్రులు వ్యవసాయం చేస్తున్నారు. మరి ఈ వైరుధ్యం సంగతేమిటి అంటే, కాలక్రమంలో వైశ్యులు అనే కేటగిరియే పోయింది ధర్మశాస్త్రాల్లో. శూద్రులే మిగిలారు. తరువాత కాలంలో వైశ్యులు వ్యాపారస్తులుగా ఒక కులంగా మిగిలిపోయినా ధర్మశాస్త్రాలలో వారి ప్రాముఖ్యత క్రమంగా తగ్గిపోయింది. అప్పటివరకు వైశ్యులకు ఉండే వ్యవసాయం చేయటం అనేది, శూద్రులకు ఉండే కూలి చేయటం అనేది రెండూ కూడా శూద్రుల యొక్క ధర్మంగా మారిపోయింది. క్రమంగా

మనువు, యాజ్ఞవల్క్యుడు, గౌతముడు వీళ్ళ ధర్మశాస్త్రాల్లో ఆ మార్పు మనకు కనిపిస్తుంది. ఈ క్రమంలోనే నేను మొదట చెప్పినట్టుగా వైష్ణవం అనేది ముందుకు వచ్చింది. దీని నేపథ్యం నేను మొదటే చెప్పాను. బ్రాహ్మణ ధర్మశాస్త్రాలు, వైదిక గ్రంథాలు తొలినాడు శూద్రుడ్ని హీనమైన వాడిగా, నీచమైన వాడిగా చూసి మోక్షం నిరాకరించాయి. చదువుకునేటప్పుడు బ్రాహ్మణుడు గానీ, క్షత్రియుడు గానీ శూద్రుడ్ని, స్త్రీని చూడకూడదన్నాయి. చూస్తే వాళ్ళ చదువంతా పోతుంది అన్నాయి. శూద్రుడు ఇచ్చిన తిండి ఎట్టి పరిస్థితిలోనూ తినకూడదు అన్నాయి. రాజుల నుండి దానం పొందటానికి యోగ్యుడైన బ్రాహ్మణుడు ఎవరయ్యా అంటే చదువుకున్నవాడి కంటే, సత్ప్రవర్తన కలిగిన వాడి కంటే కడుపులో ఎప్పుడూ శూద్రుడి తిండి పడనివాడు అందరికంటే యోగ్యుడు అని ఒక ధర్మశాస్త్రం చెపుతుంది. అంటే వాడికి చదువు లేకపోయినా, జ్ఞానం లేకపోయినా, సత్ప్రవర్తన లేకపోయినా శూద్రుడి తిండి ఎప్పుడూ తినకుండా ఉంటే చాలు వాడే అందరికంటే యోగ్యుడు అని చెప్పింది. అంత నీచంగా శూద్రులను చూసి, మోక్షం అనే ప్రసక్తే లేకుండా చేశారు. కానీ క్రమంగా ఏమైపోయింది? వ్యవసాయిక సమాజం విస్తరించే కొద్దీ శూద్రుల సంఖ్య విపరీతంగా పెరుగుతూ వచ్చింది. కొత్తకొత్త ప్రాంతాలకు పోతూ ఉంది సమాజం. ఎన్నో గణాలు, ఎన్నో తెగలు. అవన్నీ వచ్చి వర్ణవ్యవస్థలో కలుస్తూ ఉన్నాయి. అందరినీ శూద్రులు అంటున్నారు. వారి సంఖ్య ఇంత పెరిగాక వారికొక మోక్షమార్గం చూపించకపోతే వాళ్ళ అసంతృప్తిని అదుపు చేయడం సాధ్యం కాదు. ఈ లోపల బౌద్ధ మతం వచ్చింది. వాళ్లకు సమాన అవకాశం కలిగిస్తానంటోంది. మీరు భిక్షువులు కావచ్చు, రండి అని వారిని ఆహ్వానిస్తోంది బౌద్ధ మతం. అలాంటప్పుడు మోక్షం పొందడానికి వాళ్లకు అవకాశం ఎట్లాగైనా కల్పించాలి. ఎట్లా కల్పించాలి అంటే రెండుమూడు రకాల మార్గాలను వెతుక్కున్నారు. ఇవన్నీ మనకు భగవద్గీతలో కనిపిస్తాయి.

## భగవద్గీతతో మరో సర్దుబాటు

భగవద్గీత అనేది క్రీస్తు పూర్వం కాదు, క్రీస్తు శకం 200–300 ప్రాంతంలో మహాభారతంలోకి బలవంతంగా చొప్పించబడింది. ఏం చేసింది భగవద్గీత అంటే వేదాల్లో ఉన్నదంతా వాస్తవమే, పురుషసూక్తం చెప్పింది కరెక్టే అంటూ కొన్ని కొత్త సూత్రీకరణలు చేసింది. మారిన పరిస్థితుల్లో శూద్రులు, స్త్రీలు, పెరిగిన వాళ్ళ ఆకాంక్షలను ఏదో రకంగా సర్దుబాటు చేయాలి, ఎంతో కొంత రాజీపడాలి, వెసులుబాటు ఇవ్వాలి అని ఆలోచించి

ఈ కొత్త సూత్రీకరణలు చేశారు. భగవద్గీత చెప్పే రెండు విషయాలు ఏమిటంటే ఒకటి కర్మయోగం, రెండు భక్తియోగం. రెండూ దాంట్లోనే చెప్పారు, అవి రెండూ భిన్నమైన మార్గాలు అయినప్పటికీ. కర్మయోగంలో ఏం చెప్తారంటే, వర్ణధర్మాన్ని తూచ తప్పకుండ ఆచరిస్తే శూద్రుడికి కూడా ముక్తి వస్తుంది చెప్పారు. అంతవరకూ శూద్రుడికి ముక్తి వస్తుందని అని ఏ ధర్మశాస్త్రమూ చెప్పలేదు. నువ్వు దేవుడి దగ్గరకు పోయే ప్రసక్తే లేదు, నువ్వు పని చేయాలి, అదే నీ ధర్మం, నిన్ను దేవుడట్లా తయారు చేసాడు అని చెబుతూ వచ్చారు. ఇప్పుడు భగవద్గీతలో మొట్టమొదటిసారిగా ఏం చెప్తారంటే నీ కర్మలను నువ్వు సక్రమంగా ఆచరిస్తే నీకు ముక్తి లభిస్తుంది, నాలో లీనమవుతావు అని చెబుతారు.

ఈ సూత్రీకరణ రెండు రకాలుగా పని చేస్తుంది. ఒక రకం ఏమిటంటే (సామాన్య జనంలో మోక్షానికి సంబంధించి ఉన్న) సమానత్వ ఆకాంక్ష నెరవేరుతుంది. హక్కులు కావాలన్న వారి ఆకాంక్ష, అవకాశాలు ఉండాలన్న వారి ఆకాంక్ష నెరవేరుతుంది. అసమాన ప్రతిపత్తికి వ్యతిరేకంగా వారి నుండి వచ్చినటువంటి నిరసనకు కొంత స్థానం కల్పించినట్లవుతుంది. రెండవది ఏమిటంటే నువ్వు ఇక్కడి అసమానతల గురించి ఏమీ ఆలోచించవద్దు, నాకు అన్యాయం జరిగిందని గానీ, నేనెందుకు పౌరోహిత్యం చేయకూడదు, నేనెందుకు రాజ్యం చేయకూడదు, నేనెందుకు ప్రొఫెసర్ ను కాకూడదు అని ఆలోచించవద్దు. నీ కర్మ అది. పాకీ పని గానీ, ఇంకొకటి గానీ, ఏదైనా గానీ నువ్వు సక్రమంగా చేస్తూ వుంటే నీకు నేరుగా మోక్షం వస్తుందనేది. ఈ రెండు మార్గాలకు తోడు భక్తి యోగం ఒకటి చెప్పారు. అది వైష్ణవం రూపంలో ముందుకొచ్చింది. బ్రాహ్మణులు దాన్ని సొంతం చేసుకొని భగవద్గీత రూపంలో పెట్టారు.

ఆ తరువాత బ్రాహ్మణంలో నేను చెప్పినట్టుగా శ్రీవైష్ణవ శాఖ ఒకటి పుట్టింది. మా పూర్వీకులు ఆ శాఖకు చెందినవాళ్ళని చెప్పా కదా! భక్తి యోగం ఏం చెప్తుంది అంటే అచంచలమైన భక్తి ఉంటే శూద్రులకు, స్త్రీలకు కూడా మోక్షం వస్తుందని చెపుతుంది. వైష్ణవ పురాణ గ్రంథాల్లోనే కాదు భగవద్గీతలో కృష్ణుడు కూడా ఆ మాట అంటాడు. వైష్ణవ పురాణ గ్రంథాల్లో శూద్రులు, స్త్రీలు అనే పదాలు మళ్ళీ మళ్ళీ వస్తాయి. వాళ్ళు పదే పదే అన్నారంటేనే శూద్రులలోను, స్త్రీలలోను కూడా మాకెందుకు మోక్షం రాదు, మాకెందుకు దేవుడి దగ్గరకు పోయే అవకాశం ఉండదు, ఎందుకు ఆ హక్కు లేకుండా పోయింది అని నిరసన చాలా వచ్చిందని మనకు అర్థమవుతుంది. మరి నాకు భక్తి ఉండి కర్మలు చేయకపోతే పరవాలేదా? కర్మలు చేసినా భక్తి లేకపోతే ఏమవుతుంది? ఈ logical

contradictions ను వాళ్ళు పట్టించుకోరు. ఇవన్నీ భగవద్గీతలో ఉన్నాయి. వాటి మధ్యలో ఉన్న contradictions కృష్ణుడికి అనవసరం, బ్రాహ్మణ సంస్కృతికి కూడా పూర్తిగా అనవసరం. అలా కర్మ యోగంతో కలిపి భక్తియోగం కూడా చెప్పారు.

## సత్–శూద్రులు, అసత్–శూద్రులు

కాలక్రమంలో శూద్రులలోనే సత్–శూద్రులు, అసత్–శూద్రులు అనే తేడా ఒకటి పుట్టుకొచ్చింది. సత్ శూద్రులు అంటే శూద్రులలో కొంచెం బాగుండే వాళ్ళు. అంటే ఇవాళ్టి మన కమ్మ, రెడ్డి, వెలమ లాంటి కులాలు. ఈ రోజు ఆ మాట ఎక్కువ వాడటం లేదు కానీ యాభై అరవై ఏళ్ల కింద బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాలు, హేతువాద ఉద్యమాలు, కులవ్యతిరేక ఉద్యమాలు వచ్చినప్పుడు జరిగిన చర్చలో బ్రాహ్మణులు సత్–శూద్రులనే concept ను ముందుకు తీసుకొచ్చారు. ఇది ఎప్పుడు పుట్టిందంటే కూలివాళ్ళుగా ఉన్న శూద్రులలో కొంతమంది ఉత్పత్తి వ్యవస్థ విస్తరించే క్రమంలో వ్యవసాయదారులై ఇంకొంచెం ఎక్కువ ఆస్తిపరులు అవుతున్న క్రమంలో సత్–శూద్రులు, అసత్–శూద్రులు అనే మార్పు వచ్చి, సత్–శూద్రులకైతే మేము కొన్ని కర్మలు చేస్తాం అని బ్రాహ్మణులు అన్నారు. వాళ్లకయితే ఇంట్లో కొచ్చి మేము కొన్ని పూజలు చేస్తాం, యజ్ఞాలు అవీ వాళ్ళు కూడా నిర్వహించొచ్చు అన్నారు. అసత్–శూద్రులు అని మిగిలిన శూద్రులను మాత్రం దూరం ఉంచారు.

## కొత్త కులాలకు కారణం వర్ణసాంకర్యం కాదు

ఇట్లా ఉత్పత్తి వ్యవస్థ విస్తరించి రకరకాల గణాలు, తెగలు వచ్చి వర్ణవ్యవస్థలో భాగమయ్యాయి. వాస్తవానికి ఇది పెద్ద మార్పు. కానీ ఈ మార్పును మార్పుగా గుర్తించి కొత్త సిద్ధాంతం చేస్తే, ప్రాచీనతకు ఉండేటటువంటి ఆ ప్రాశస్త్యము పోతుంది. అప్పుడు నీ మాటలకు ఉండేటటువంటి బలం, శక్తి పోతుంది. అందువల్ల బ్రాహ్మణులు ఎప్పుడూ కూడా, కొత్త మార్పు వచ్చింది కాబట్టి సిద్ధాంతం మార్చాలని అనుకోలేదు. కొత్తగా వచ్చిన మార్పు అంతా కూడా పాత సిద్ధాంతంలోనే ఇరికించి, ఇది వేదాల్లోనే ఉంది అన్నారు. అప్పుడే ఆ సిద్ధాంతానికి ప్రాశస్త్యం, ప్రతిష్ట, సిద్ధాంత బలం (ideological power) చేకూరుతుంది. అందుకని ఏం చేశారంటే, క్షత్రియులన్నావు, బ్రాహ్మణులు అన్నావు, వైశ్యులు అన్నావు, శూద్రులు అన్నావు, ఇన్ని కులాలు ఎక్కడ నుండి వచ్చాయి అని

అడిగితే వర్ణ సాంకర్యం జరగకూడదు అని చెప్పినా వీళ్ళు వర్ణ సాంకర్యం చేస్తూ వచ్చారు కాబట్టి ఆ వర్ణ సాంకర్యం నుండే ఈ కులాలన్నీ పుట్టాయి అన్నారు. బ్రాహ్మణ మగవాడికి, శూద్ర స్త్రీకి పుట్టిన వాళ్ళను నిషాదులు అన్నారు. బ్రాహ్మణ స్త్రీకి, శూద్ర పురుషుడికి పుట్టినవాళ్ళను చండాలులు అన్నారు. అదే విధంగా బ్రాహ్మణ మగవాడికి, వైశ్య స్త్రీకి; బ్రాహ్మణ స్త్రీకి, వైశ్య మగవాడికి; ఇట్లా రకరకాల వర్ణసాంకర్యం జరిగి మరికొన్ని కులాలు పుట్టాయని ధర్మసూత్రాలలోనే రాసుకుంటూ వచ్చారు. నిజానికి ఈ కులాలు పుట్టింది అట్లా కాదు. ఎట్లా పుట్టాయి అంటే ఆదిమ గణాలుగా ఉన్నటువంటి వాళ్ళు వ్యవసాయ విస్తరణలో భాగంగా ఈ సమాజంలో వచ్చి చేరడం వల్ల పుట్టాయి. కొందరు శూద్రులుగా చేరారు, కొందరు కూలివాళ్ళుగా చేరారు. కొందరు వైశ్యులుగా వచ్చి చేరారు. కొద్దిమంది మాత్రం క్షత్రియులుగా, బ్రాహ్మణులుగా వచ్చి చేరారు. కాని ప్రధానంగా వాళ్ళు అణగారిన కులాలుగానే వచ్చి ఈ సమాజంలో చేరారు.

ఇంతవరకు మనం శూద్రులుగా గుర్తించనివాళ్ళు వచ్చి ఇక్కడ చేరారు అని ఒప్పుకుంటే ఏమవుతుంది? నువ్వు చెప్తున్న సిద్ధాంతానికి ఒక చారిత్రకత ఉందని అర్థమవుతుంది. చారిత్రకత ఉండేదానికి పవిత్రత ఎప్పుడూ ఉండదు. చారిత్రకతను నిరాకరించినప్పుడే పవిత్రత ఉంటుంది. కాబట్టి దీనికి చారిత్రకత ఏమీ లేదు, ఇది పవిత్రమైనది అని చెప్పాలంటే, ఇది కొత్త మార్పేమీ కాదు, మా నాలుగు వర్ణాలే సత్యము, వాటిలో వర్ణ సాంకర్యం జరగటం వల్ల వీళ్ళు పుట్టారు అనక తప్పలేదు వాళ్ళకు. మనం ఆంధ్రులం అని చెప్పుకుంటాం. ఈ ఆంధ్రులు అనే వాళ్ళు అప్పటికొక తెగ. ఈ తెగ ఎట్లా పుట్టింది అంటే దానికొక కథ ఉంది. పూర్తి కథ మరిచిపోయాను కాని బ్రాహ్మణులు, శూద్రులకు పుట్టినటువంటి నిషాదులకు, బ్రాహ్మణులకు, వైశ్యులకు పుట్టిన ఇంకొక కులంతో మళ్ళీ వర్ణ సాంకర్యం జరిగితే ఈ ఆంధ్రులు పుట్టారని ఆ కథ చెపుతుంది. మనందరం అట్లా పుట్టిన వాళ్ళం అని లెక్క. దీని అర్థమేంటి అంటే, అప్పటికి ఆర్యసమాజానికి చాలా దూరంగా ఎక్కడో కృష్ణా గోదావరి తీరంలో ఉన్న ఆంధ్ర అనే తెగ కొత్తగా విస్తరిస్తున్న వ్యవసాయక వర్గ సమాజంలో కాలక్రమంలో వచ్చి భాగమయ్యారని. *(ఇక్కడ కొంత భాగం రికార్డు కాలేదు.)* ఇట్లా రెండు వర్ణాల సాంకర్యం, దాని మీద మరో సాంకర్యం జరిగితే ఈ ఆంధ్రులు పుట్టారు అని సిద్ధాంతం. అట్లా సిద్ధాంతాలు చేసుకుంటూ తొలినాటి పురుషసూక్తంలో చెప్పినటువంటి దాని ప్రాశస్త్యాన్ని కాపాడుకొంటూ దాని ద్వారా బ్రాహ్మణ్యానికి, బ్రాహ్మణులకు ఉండే సైద్ధాంతిక బలాన్ని కూడా కాపాడుకుంటూ వచ్చారు.

## అంటరానితనం

ఐతే ఈ క్రమంలోనే కూలి మాత్రమే చేసుకొని, లేదా కూలి కంటే కూడా సమాజం చేత ఇంకా నీచంగా భావించబడే – అంటే చచ్చిపోయిన పశువులను ఏరిపారేయటం వంటి – పనులు చేసుకునే వాళ్ళను అంటరానివాళ్లుగా భావించడం కూడా ప్రారంభం అయింది. ఇది డిగ్రీలుగా, గ్రేడ్‌లుగా మొదలైంది కాబట్టి కరెక్టుగా కచ్చితంగా ఎప్పుడు ప్రారంభమైంది అనేది చెప్పలేము గాని దాదాపుగా వేదకాలం అయిపోయిన వెంటనే అపపాత్రులు అని కొంతమందిని అనేవారు. హైందవ సంస్కృతిలో మొట్టమొదటి అంటరానివాళ్ళు చండాలులు. అపపాత్రులు ఏ రకంగా అంటరాని వాళ్ళంటే వాళ్ళు ఉపయోగించిన పాత్రను శుభ్రంగా కడిగినా కూడా వేరేవాళ్లు ఉపయోగించటానికి వీలు లేదు. అక్కడినుండి మొదలై అంటరానితనం అనేది ఎక్కడిదాకా పోయింది అంటే – నువ్వు కనబడటానికి వీలు లేదు, నీ నీడ తగలటానికి వీలు లేదు, నీ ఊపిరి తగలటానికి వీలు లేదు, నీ ఇల్లు కూడా కనబడటానికి వీలు లేదు, అది ఊరి బయట ఎక్కడో ఉండాలి అనే దాకా పోయింది. ఈ అంటరానితనం ఋగ్వేదంలో లేదు. తరువాత కాలంలో క్రమంగా మొదలయ్యింది. అంత్యావసాయి, చండాలులు, కొంతవరకు నిషాదులు – వీరంతా అంటరానితనాన్ని రకరకాల డిగ్రీలలో అనుభవించిన వాళ్ళు. కాలక్రమంలో వీళ్ళు పుట్టడం పుట్టడమే వ్యవసాయక వర్గ సమాజానికి రకరకాల కూలి పనులు చేసి పెట్టే, అశుభ్రంగా భావించబడే పనులు చేసి పెట్టే వాళ్ళుగా పుట్టారు. ఈ పని మేము మాత్రమే ఎందుకు చేయాలి, మేము ఇంకొకటి ఎందుకు చేయకూడదు అనే ప్రశ్న వారికి రాకుండా ఉండటానికి, అసలు మీ ఆలోచన కాదు, మీ నిరసన కాదు, మీ చూపు, మీ ఉనికే మాకు పూర్తిగా అశుభ్రం కాబట్టి మీరు దూరముండండి అని వారిని పూర్తిగా బహిష్కరించారు. సమాజం తనకు అవసరమైనటువంటి కొన్ని ‘unclean’ పనులు చేయించుకోవటం కోసమే ఈ బహిష్కరణ.

ఇలా ఎందుకు జరిగింది? ఇది ఈ రూపమే ఎందుకు తీసుకుంది? వేరే దేశాల్లో పాకీ పని చేసిన వాళ్ళు లేరా? వేరే దేశాల్లో చచ్చిపోయిన పశువులను ఏరి పారేసిన వాళ్ళు లేరా? వేరే దేశాల్లో కూలి వాళ్ళు లేరా? నేను అందుకే అన్నది ఉత్పత్తి వ్యవస్థలో వస్తున్న మార్పులతో సమన్వయపరుచుకుంటూనే మనం కులం గురించి చెప్పగలము అని. కేవలం ఉత్పత్తి వ్యవస్థలో వస్తున్న మార్పులను బట్టి మనం కులవ్యవస్థలో వచ్చిన మార్పులను నిరూపించాలి, నిర్ధారించాలి అంటే అది సాధ్యమయ్యే పని కాదు. మార్క్సిజం

చెప్పింది కాబట్టి ఇది అయ్యుండాలి అని అనుకోవచ్చు కానీ వాస్తవానికి, ఉత్పత్తి వ్యవస్థలో వస్తున్న మార్పులను సమన్వయపరుచుకొని దీనిని వివరించుకోవటం అనేది అర్థం కావటానికి పనికొస్తుంది. ఆ మేరకు సాధ్యమవుతుంది. దాని నుంచి దీనిని డెడ్యూస్ చేయాలి, ఉత్పత్తి వ్యవస్థలో ఈ రకమైన మార్పులొచ్చాయి కాబట్టి అంటరానితనం వచ్చింది అనేది రుజువు చేయటం అసాధ్యం. అయితే ఆ సమన్వయాన్ని మనం వదిలిపెట్టేస్తే మాత్రం మనకు చరిత్ర పూర్తిగా అర్థం కాదు. నాలుగు వర్ణాలు ఉండేవి, ఆ తరువాత సంఘర్షణాలేవో జరిగాయి, ఇంతమాత్రమే అర్థమవుతుంది తప్ప, ఉత్పత్తి వ్యవస్థను, వ్యవసాయ విస్తరణను, గిల్డుల, శ్రేణుల విస్తరణను పట్టించుకోకపోతే మనకు చరిత్ర మొత్తంగా అర్థం కాదు.

ఈ దశను ఇక్కడితో వదిలేస్తా. వర్ణవ్యవస్థ పుట్టుక, రకరకాల కులాలు వచ్చి వ్యవసాయిక వర్గ సమాజంలో కలవడం, కుల కట్టడి అనేది పూర్తిగా అమానుషమైన ఒక నిచ్చెన వ్యవస్థగా తయారవడం...ఇంతవరకు చెప్పి వదిలేస్తా. బౌద్ధ మతం లాంటివి ఒక ప్రత్యామ్నాయ ప్రతిపాదన చేసినప్పటికీ అది ఎందుకు భారతదేశంలో ఓడిపోయింది, ఎందుకు ఇమడలేకపోయింది అనే దానికి మనకు ఇప్పటికీ కారణం తెలియదు. రకరకాల సిద్ధాంతాలున్నాయి. అలాగే ఈ శతాబ్దం ప్రారంభంలో బ్రాహ్మణ మతం తిరిగి ఎందుకు పుంజుకుంది అనేది మనకు తెలియదు. ఒకటి మాత్రం ఏమిటంటే కొత్తగా వచ్చిన వాటిన్నిటిని కూడా పాత సిద్ధాంతంలో ఇముడ్చుకొని సంలీనం చేసుకొనేటటువంటి ఒక ప్రక్రియ బ్రాహ్మణ మతం చేసుకుంటూ వచ్చింది అనేది. ఒక ఉదాహరణ చెప్పాలంటే మొట్టమొదట క్షత్రియుడు కాని వాడు అసలు పరిపాలించటానికి యోగ్యుడే కాదన్నారు. కాని ఏం జరిగింది? సరే మౌర్యులు క్షత్రియులా లేకపోతే శూద్రులా అనేది ఒక ప్రశ్న. ఏకాభిప్రాయం లేదు ఆ విషయంలో. కొంతమంది 'మురి' అనేది క్షత్రియులలో ఒక గోత్రం అంటారు. కొంత మంది వాళ్ళు శూద్రులంటారు. అది పక్కన పెడదాం. విదేశీయులు వచ్చారు హూణులు అని, కుషాణులు అని, వాళ్ళు పరిపాలించారు. మొదట వాళ్ళను మేము ఒప్పుకోము పో అని బ్రాహ్మణులు అన్నారు.

## కట్టడికి భయపడే వైష్ణవాన్ని ఆదరించారు

కాని ఒప్పుకోకుండా ఎన్నాళ్ళు ఉంటారు, ఇక్కడ బ్రతుకుతున్నారు, రాజుగారు వచ్చి యాగం చేయమంటే చెయ్యకపోతే చంపేస్తారు వాళ్ళు. ఎట్లైనా ఒప్పుకోవాలి. ఈ లోగా ఆ రాజులేం చేశారు? ఇక్కడున్న బ్రాహ్మణ మతం ఒప్పుకోకపోతే, అప్పటికే పుట్టిన

వైష్ణవ మతాన్ని ఓన్ చేసుకున్నారు. ఎందుకంటే వైష్ణవ మతం వర్ణవ్యవస్థను పూర్తిగా పాటించకుండా, భక్తి ఉంటే శూద్రులు కూడా మోక్షం పొందవచ్చన్నారు కాబట్టి వైష్ణవ మతాన్ని ఓన్ చేసుకొన్నారు. విష్ణువును బ్రహ్మాండంగా స్తోత్రిస్తూ మన దేశంలో వచ్చిన మొట్టమొదటి శాసనాలన్నీ కుషాణులు, హూణులు, మొదలైనటువంటి పశ్చిమాసియా వాళ్ళు వేసిన శాసనాలే, ఈ దేశం వాళ్ళు వేసినవి కాదు. అటువంటి వైష్ణవ మతాన్ని బ్రాహ్మణ మతంలో కలుపుకోవడానికి బ్రాహ్మణులు ఏం చేశారంటే – కొన్ని సంస్కారాలు, ముఖ్యంగా హిరణ్యగర్భ వంటి కొన్ని కర్మకాండలు కనిపెట్టారు. క్షత్రియుడు కాని రాజును ఒక కుండలో కూర్చోపెట్టి, కొన్ని వేదమంత్రాలు చదివి, ఆ కుండను పగులగొట్టి అతడ్ని బయటకు రమ్మని, ఇప్పుడు నువ్వు క్షత్రియుడు అయిపోయావు అన్నారు. దాని అర్థం అతను క్షత్రియ యోని నుంచి బయటకి వచ్చినట్టు. అట్ల ఏదో చేసి వాళ్ళను క్షత్రియులుగా కలుపుకున్నారు. వైష్ణవ మతాన్ని కూడా కలుపుకున్నారు. దానిని కూడా బ్రాహ్మణ మతంలో భాగం చేసి విష్ణువు చేతనే భగవద్గీత రూపంలో చెప్పించి, దానికి మహాభారతంలో కేంద్ర స్థానం ఇచ్చారు. ఇట్లా రకరకాల సర్దుబాట్లు చేసుకుంటూ వచ్చారు. సత్ శూద్రులు, అసత్ శూద్రులు అని కొత్త వర్గీకరణ చేశారు. సత్ శూద్రుల కోసం కొత్తగా గృహసూత్రాలను రాశారు. 'శూద్రోపకల్పనం' వగైరా పేర్లతో ఇవి రకరకాలుగా ఉన్నాయి. వాటి పేరులోనే శూద్ర అని ఉంటుంది. అట్లే వేదమంత్రాలు చదవటం నిషిద్ధమైనప్పటికీ, పురాణశ్రవణం చేసుకోవచ్చు, పూజలు చేసుకోవచ్చు, మంత్రాలు చదువుకోవచ్చు, వ్రతాలు చేసుకోవచ్చు అని అదొక వెసులుబాటు ఇచ్చారు. ఇట్లా సర్దుబాట్లు చేసుకుంటూ పోయారు. ఆ క్రమంలో ఇది రూపుదిద్దుకుంది.

## కోతి, ఎద్దు ఎలా దైవచిహ్నాలయ్యాయంటే...

సరే మనం ఇక్కడ ఆగి ఒకసారి ఈ వ్యవసాయిక వర్గ సమాజం యొక్క స్వరూపాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకుందాం. ఎందుకంటే మనం ఇక్కడ నుంచి మధ్యయుగాలకు పోవాల్సి ఉంటుంది. గ్రామవ్యవస్థ ఏ విధంగా ఏర్పడింది, విస్తరించింది, రకరకాల తెగలను ఎలా లోబరుచుకున్నారు, కులాలుగా కలుపుకున్నారు, ఎటువంటి పురాణాలు సృష్టించారు, ఏ ఏ దేవుళ్ళను కలుపుకున్నారు మొదలైన విషయాలు. కోతిని ఆరాధ్యంగా భావించే ఒక గణం ఉందనుకోండి. ఆ గణాన్ని అణచివేసి శూద్రుల్లో కలిపేసి, మీ కోతిని మా రాముడుకి బంటుగా ఆంజనేయుడుగా పెట్టుకుంటాం అన్నారు. మరో ఉదాహరణ చెప్పాలంటే

చాలా ప్రాచీన కాలంలో రాయలసీమ జిల్లాలలో ఎద్దును ఆరాధ్య దైవంగా భావించేటటువంటి తెగలు ఉండేవి. ఆ తెగలన్నీ శూద్రులుగా, కూలి వాళ్ళుగా బ్రాహ్మణ సమాజంలో కలిశారు. ఆ కలిసే దానిలో భాగంగా ఏమైందంటే వారు పూజించే ఎద్దు నంది రూపంలో శివుడికి వాహనం అయింది. అయినా విడిగా, శివుడు లేకుండా ఎద్దుని మాత్రమే పూజించే క్షేత్రాలు ఇప్పటికీ రాయలసీమలో ఉన్నాయి, మహానంది ఉంది, లేపాక్షి ఉంది. నంది అని పేరొచ్చే ఊర్లు ఇప్పటికీ రాయలసీమలో చాలా ఉన్నాయి – నందికొట్కూరు, నంద్యాల, నందివరం అని కర్నూలు, కడప జిల్లాల్లో ఊర్లు ఉన్నాయి. అంటే ఎద్దును ప్రాచీన కాలంలో ఎద్దుగానే పూజించినటువంటి ఆ ప్రజలు, శూద్ర కులంగా బ్రాహ్మణ సమాజంలో వచ్చి చేరిన తర్వాత దాన్ని నందిగా పూజించడం ప్రారంభించారు. అంటే అది శివుడి వాహనం నంది అయినా శివుడు లేకుండా ఎద్దుగానే పూజలు అందుకుంటుంది. కాకపోతే ఇప్పుడు దాన్ని ఎద్దు అనరు, శివుడి వాహనం నంది అంటారు. మహానంది ఒక పుణ్యక్షేత్రం. లేపాక్షి ఒక పుణ్యక్షేత్రం. ఇట్లాంటి సర్దుబాట్లు చాలా అవుతూ ఉంటాయి.

## మొదటిసారిగా గ్రామ వ్యవస్థ

గ్రామవ్యవస్థ దగ్గరకు వస్తే ఏం కనిపిస్తుందంటే – పూర్తిగా వ్యక్తిగత ఆస్తి అనేది చాలాకాలం భారతదేశంలో లేదు. అట్లా అని చెప్పి మొత్తం అంతా సమిష్టిగా ఉమ్మడిగా అనుభవించారన్నది కూడా వాస్తవం కాదు. రకరకాల హక్కులుండేవి భూమి మీద. ఒక గ్రామం ఏ రకంగా ఏర్పడింది భారతదేశంలో అనేది మనం అర్థం చేసుకొంటే, సాధారణంగా అడవిగా ఉన్న ప్రాంతాన్ని ఏదో ఒక గుంపు ప్రజలు పోయి దానిని ముందుగా వ్యవసాయ యోగ్యం చేస్తారు. ఈ ప్రజలు ఎవరై ఉంటారు అంటే తొలినాడు వైశ్యులై ఉంటారు, తర్వాత శూద్రులు అయ్యుంటారు. శూద్రులు వ్యవసాయదారులయిన కాలం నుంచి – అంటే అశోకుడు, మౌర్యుల కాలం నుంచి – ఒక శూద్ర గుంపు, పరస్పరం బంధుత్వం ఉండేటటువంటి వాళ్ళు, అంటే ఒక కుదురు వాళ్ళు పోయి ఒక అడవి ప్రాంతాన్ని శుభ్రం చేసి ఒక గ్రామం నెలకొల్పుతారు. ఆ శూద్రుల గుంపు/కుదురు ముఖ్యులుంటారు కదా వాళ్ళు ఆ గ్రామానికి పెద్దలు అవుతారు. తర్వాత మంగలి, చాకలి, కమ్మరి, కుమ్మరి మొదలైన చేతివృత్తుల వాళ్ళు వచ్చి వీళ్ళకు అవసరమైన పనులు చేసిపెట్టి వచ్చే ఆదాయంతో ఆ గ్రామంలో స్థిరపడతారు. బహుశా పరిసరాల్లో ఉండేటటువంటి ఆదిమతెగల వాళ్ళను లోబర్చుకొని, వాళ్ళను కూలివాళ్ళుగా, మాల మాదిగలుగా మార్చి గ్రామ శివార్లలో

ఉంచి పనులు చేయించుకుంటారు. ఇదే గ్రామంలో ఆ దేశాన్ని పరిపాలించిన రాజు గారు ఒక వంద ఎకరాలనో, రెండొందల ఎకరాలనో ఒక బ్రాహ్మణుడికో, ఒక క్షత్రియుడికో, ఒక సైనికాధికారికో, ఒక గుడికో, అగ్రహారానికో జాగీరుగా ఇస్తాడు, మాన్యంగా ఇస్తాడు. ఆ మాన్యం కూడా అదే గ్రామంలో ఉంటుంది.

అంతేకాకుండా బ్రాహ్మణులు ఏం చేశారంటే శూద్రులు రైతులయిన క్రమంలో వాళ్ళని కూడా కొంచెం మంచి చేసుకునే ప్రయత్నం మొదలుపెట్టారు. ఒకప్పుడు శూద్రుడికి మోక్షమే లేదన్న వారు, తరువాత కర్మలు చేస్తే మోక్షమొస్తుందన్న వారు, ఆ తర్వాత భక్తి ఉంటే మోక్షమొస్తుందన్న వారు – ఇప్పుడు ఏమన్నారంటే మోక్షానికి ఉన్నతమైన మార్గం బ్రాహ్మణునికి దానాలు చేయడం అన్నారు. మొదట్లో శూద్రునికి దానం చేయటానికి ఆస్తి లేదు. వాడికి ఆస్తి వచ్చాక మాకు దానం ఇస్తేనే నీకు మోక్షమొస్తుంది అన్నారు. శూద్రునికి ఉత్తమ మార్గం ఇదే అని కూడా సిద్ధాంతం చెప్పారు. పాపం శూద్రులు. వాళ్ళు చాలా దానం చేశారు. పదెకరాలు, యాభై ఎకరాలు, అరవై ఎకరాలు, వందెకరాలు – ఈ నాయుడు గారు, ఆ రెడ్డి గారు ఆ పని చేస్తూ వచ్చారు. అట్లా వాళ్ళు కూడా వచ్చి అక్కడ సెటిల్ అయ్యారు.

మన గ్రామాల్ని పరిశీలిస్తే ఇవ్వాల్టికి కూడా ఏ గ్రామంలోనైనా ఏదో ఒక శూద్ర కులం ప్రధానమైన కులంగా ఉంటుంది. ఎక్కువ కుటుంబాలు వాళ్ళవే ఉంటాయి. చాలా సాధారణంగా బంధుత్వాలు, సంబంధాలు వాళ్ళ మధ్యే ఉంటాయి. ఎక్కువ భూమి వాళ్ళదే ఉంటుంది. కమ్మ కావచ్చు, రెడ్డి కావచ్చు, కాపు కావచ్చు, ఇంకొకటి కావచ్చు. ఇతర కులాల వాళ్ళు వారి అనుమతితో వచ్చి చేరి subordinate పొజిషన్లో ఉంటారు. వీరు కాక వృత్తి పనులు చేసే వాళ్ళు ఉంటారు, కూలి చేసుకునే మాలమాదిగలు ఊరి బయట ఉంటారు. ఓ గుడి ఉంటే దానికి కొంత భూమి మాన్యంగా ఉంటుంది. ఒక యాభై అరవై ఏళ్లు వెనక్కి పోతే ఇటువంటి గ్రామాల్లో బ్రాహ్మణులకు కూడా కొన్ని భూములు ఉండేవి. తర్వాత కాలంలో వాళ్ళు వాటిని కౌలుకిచ్చి, ఆ తర్వాత అమ్ముకొని వెళ్లిపోయారనుకోండి.

ఈ వ్యవస్థ గురించి తెలుసుకోవడం ఎందుకు ముఖ్యం అంటే ఒక చారిత్రక క్రమంలో ఈ వ్యవస్థ ఏర్పడడం, ఆ క్రమంలో  శూద్రులు వ్యవసాయదారులు కావడం, ఆదిమ గణాలు, తెగలు కులాలుగా వచ్చి చేరడం, దీని మీద కూడా బ్రాహ్మణాధిక్యత మరొక

రూపంలో నెలకొనడం, ఈ క్రమాన్నంతా అర్థం చేసుకోకపోతే గ్రామీణ నిర్మాణం ఈ నాటికీ మనకు అర్థం కాదు. ఈనాడు గ్రామాల్లో జరిగేటటువంటి సంఘర్షణలను గానీ, కొట్లాటలను గానీ, అత్యాచారాలను గానీ వాటికి కారణాలను అర్థం చేసుకోవాలంటే ఈ చారిత్రక పునాదులను ముందుగా అర్థం చేసుకోవడం అవసరం.

## పాలకులు మారినా మౌలిక వ్యవస్థ మారలేదు

భారతదేశంలో గ్రామీణ వ్యవసాయిక సమాజం మౌర్య చంద్రగుప్తుల కాలం దగ్గర మొదలయ్యి, కొంచెం కొంచెంగా ఏర్పడుతూ వచ్చి, గుప్త రాజుల కాలానికి బ్రహ్మాండంగా విస్తరించింది. పై వారి ఆధిక్యత మాత్రం మారుతూ వచ్చింది. వివిధ సమయాలలో వేరు వేరు రాజ్యాలు, రకరకాల మతాలు ఆ వ్యవస్థపై పెత్తనం చెలాయిస్తూ వచ్చాయి. గ్రామీణ వ్యవసాయిక సమాజం ఏర్పడ్డాక ముస్లిం పాలకులు వచ్చారు, ఢిల్లీ సుల్తానులు వచ్చారు, బ్రిటిష్ వాళ్ళు కూడా వచ్చారు. ఢిల్లీ సుల్తానులు అందరూ మతోన్మాదులేమీ కారు, అలాగే మొగల్స్ అందరూ కూడా మతోన్మాదులేమీ కారు. అయితే వాళ్ళ మతాన్ని వాళ్ళు నమ్మారు. అంతే కాదు, మన కులవ్యవస్థ చాలా అనాగరికం అని కూడా వాళ్ళు నమ్మారు. బ్రిటిషు వాళ్ళకు క్రైస్తవ మతమే కాకుండా, ఆధునిక ప్రజాతంత్ర భావాలు కూడా ఉన్నాయి. అయినప్పటికీ ఈ గ్రామీణ వ్యవస్థను గానీ, కులవ్యవస్థను గానీ, దానిలో ఉన్నటువంటి ఆస్తి సంబంధాలను గానీ మౌలికంగా మార్చే ప్రయత్నం ఎవ్వరూ చేయలేదు. భారతదేశంలో ఇప్పటికీ అదే అలాగే కొనసాగుతూ ఉంది. పెట్టుబడిదారీ వ్యవస్థ రావడం వల్ల, వ్యవసాయ వ్యాపారీకరణ జరగడం వల్ల కొన్ని మార్పులు వచ్చినప్పటికీ మౌలికమైన మార్పులు ఎవరూ తీసుకురాలేదు.

ధర్మశాస్త్రాల్లో ఏం చెప్పారంటే శూద్రులకు అగ్రవర్ణాల పట్ల ఉండే బాధ్యతను నిర్వర్తింపచేయటం మాత్రమే రాజుగారి ధర్మం, అంతవరకు కచ్చితంగా ఉండాలి. కాని శూద్రుల అంతర్గత వ్యవహారాలు మాత్రం వారి వారి సంప్రదాయాల ప్రకారం జరగనివ్వాలి. అగ్రవర్ణాల పట్ల వాళ్ళు చెయ్యాల్సిన సేవలు మాత్రం తప్పనిసరిగా జరిగేలా రాజు చూడాలి. అది రాజు ధర్మం. ఆ ధర్మాన్ని రాజు సక్రమంగా నిర్వర్తించినప్పుడే అది ధర్మరాజ్యం, రామరాజ్యం అనిపించుకుంటుంది. ధర్మం నాలుగు కాళ్ళ మీద నడిచినట్టు అనిపించుకుంటుంది. నాలుగు కాళ్ళు అంటే ఏమిటి నాలుగు వర్ణాలు. నాలుగు వర్ణాలు సక్రమంగా తమ తమ డ్యూటీలు చేస్తూ ఉంటే ధర్మం నాలుగు పాదాల మీద నడిచినట్టు.

అంటే వర్ణవ్యవస్థను కాపాడటం ధర్మం. ధర్మం నాలుగు కాళ్ళ మీద నడవటం అంటే అర్థమది. ఆ ధర్మాన్ని నిలబెట్టినవాడే ధర్మరాజు. అతనే మహా ధర్మ ప్రభువు. అంతకంటే వేరే అర్థమేమీ లేదు దీనికి.

ఈ రోజు ఏమై పోయిందంటే పాత అర్థాలుండే మాటలకు కొత్త అర్థాలు ఇచ్చి వాడుతున్నారు. దాని వల్ల కొత్త అర్థంలో వాడినట్టూ ఉంటుంది, పాత అర్థాన్ని కాపాడినట్టూ ఉంటుంది. ఇవాళ ధర్మం అనే మాటను ఇంగ్లీషులో justice అనే మాటకు సమానార్థకంగా వాడే ప్రయత్నం చేస్తున్నారు. ఇంగ్లీషులో justice అనే మాటను మనం న్యాయం అందాం, ఇంకొకటి అందాం కానీ 'ధర్మం' అంటే ఏమవుతుందంటే వర్ణధర్మం అనే అర్థం వస్తుంది. ఆ వాసన దానికి ఎప్పటికీ పోదు, పోలేదు. అందుకే మనం ధర్మం అనే మాట వాడొద్దు. న్యాయం అందాం, ఇంకేదైనా అందాం, కావాలంటే కొత్త మాట పుట్టించుకుందాం.

## క్రమంగా రెవిన్యూ యంత్రాంగమే కీలకంగా మారింది

ఢిల్లీ సుల్తానులు గానీ, మొగలులు గానీ, బహమనీయులు గానీ, బ్రిటిష్ వాళ్ళు గానీ గ్రామాల అంతర్గత నిర్మాణాన్ని (internal structure) ముట్టుకోలేదు. మొగల్స్‌కు ముందు వచ్చిన ఫిరోజ్ తుగ్లక్, అల్లావుద్దీన్ ఖిల్జీ, షేర్ షా వాళ్ళంతా ఏం చేశారంటే ఒక కొత్త రెవెన్యూ యంత్రాంగాన్ని భారతదేశంలో ప్రవేశపెట్టారు. ఈ యంత్రాంగం ఏం చేసిందంటే – ఒకప్పుడు ఎట్లాగైతే గ్రామంలోని వైశ్యులు, శూద్రులు ఉత్పత్తి చేసిన దానిలో అధిక భాగాన్ని బ్రాహ్మణులు, క్షత్రియులు తీసుకున్నారో దాన్ని generalise చేస్తూ ఇండియాలో కొత్తగా ఒక ప్రభుత్వ వ్యవస్థను (State structure) వాళ్ళు తీసుకువచ్చారు. అది గ్రామంలో జరిగే వ్యవసాయ ఉత్పత్తి నుండి ప్రభుత్వానికి ఎంత రావాలో, దానిని ఏ పద్ధతిలో వసూలు చేసుకోవాలో నిర్ణయించి అమలు చేస్తుంది. మామూలుగా గ్రామంలో వ్యవసాయ ఉత్పత్తి ఏ రకంగా జరుగుతుంది? సంప్రదాయకంగా ఉన్న ఆస్తి సంబంధాలు, సంప్రదాయకంగా ఉన్న కులవ్యవస్థల ప్రాతిపదిక మీద జరుగుతుంది. అంటరానివాళ్ళయిన మాలమాదిగలకు ఆస్తి ఉండదు, ఉత్పత్తి సాధనాలు ఉండవు కాబట్టి వాళ్ళు కూలి చేస్తూనే ఉంటారు. శూద్ర కులాల రైతులకు భూమి మీద యాజమాన్యం ఉంటుంది. అయితే అది సమిష్టి యాజమాన్యం కావచ్చు, కొంతవరకు వ్యష్టి యాజమాన్యం కూడా కావచ్చు. దానాల రూపంలో, మాన్యాల రూపంలో, అగ్రహారాల రూపంలో బ్రాహ్మణులు ఆస్తి అనుభవిస్తూ ఉంటారు. సాంప్రదాయకమైన ఈ హైందవ గ్రామీణ వ్యవస్థను అట్లే ఉంచి

దాంట్లో ఉత్పత్తి అయిన దాంట్లో నుండి నలభై శాతమో, యాభై శాతమో కేంద్ర పాలకవర్గానికి చెందేలా చేశారు వాళ్ళు. ఈ కేంద్ర పాలక వర్గంలో ఎవరుంటారంటే అరేబియా నుంచి, పర్షియా నుంచి, ఇరాన్ నుంచి వచ్చినటువంటి పెద్దపెద్ద జాగీర్దార్లు ఉంటారు. కింద మాత్రం సాంప్రదాయకంగా evolve అయినటువంటి వ్యవసాయక కులవ్యవస్థ ఉంటుంది. ఈ కులవ్యవస్థ ఇస్లాంకు పూర్తిగా వ్యతిరేకమైనప్పటికీ సుల్తానులు, నవాబులు దాన్ని ఏ మాత్రం కదిలించకుండా, ముట్టుకోకుండా ఆ కులవ్యవస్థ ద్వారా జరిగే ఉత్పత్తిలో నుండి సగ భాగాన్ని తీసుకుంటారు. దీనికి కావలసిన రెవెన్యూ యంత్రాంగాన్ని వారు తయారు చేసుకున్నారు.

సరే, మరి గ్రామంలో ఉండి రెవెన్యూ యంత్రాంగానికి అవసరమైన శిస్తును వసూలు చేసేవాడు ఎవడు? పైన తహసీల్దారు ఉంటాడు, సుబేదారు ఉంటాడు, జాగీర్దారు ఉంటాడు, దివాన్ దారు ఉంటాడు, రెవెన్యూ మినిస్టరు ఉంటాడు. కాని గ్రామంలో మాత్రం వాళ్ళు ఎవరూ ఉండరు. గ్రామంలో ఎవరుంటారంటే ఆ గ్రామంలో సాంప్రదాయకంగా వస్తున్న గ్రామ ముఖ్యులకు, గ్రామ పెద్దలకే రెవెన్యూ యంత్రాంగంలో స్థానం కల్పిస్తారు. సాధారణంగా గ్రామంలో ఒక కులం వాళ్ళు ఎక్కువగా ఉంటారు, ఆ కులానికి ఒక ముఖ్యుడు ఉంటాడు. ఆ కుల ముఖ్యుడే మునసబు అవుతాడు, ఆ గ్రామానికి రెవెన్యూ ప్రతినిధి అవుతాడు. అతడు తెలంగాణలో పటేల్ అయితే, మహారాష్ట్రలో పాటిల్, రాయలసీమలో రెడ్డి. ఇంకొక చోట నాయుడు, చౌదరి అవుతాడు.

ఢిల్లీ సుల్తానులు, మొగలులు ప్రవేశపెట్టిన ఈ మొత్తం రెవెన్యూ యంత్రాంగంలో పైనుంచి కింద తహసీల్దార్ల దాకా పేర్లన్నీ కూడా అరబ్బీ పేర్లు, పర్షియన్ పేర్లే. ముఖ్యంగా పర్షియన్ పేర్లే. గ్రామంలో ఉండే రెవెన్యూ అధికారుల పేర్లు మాత్రం మన పేర్లు. మునసబు అన్న ఒక్క మాటను మినహాయిస్తే మిగిలిన అన్ని పేర్లు కూడా సాంప్రదాయకంగా భారతీయ భాషల్లో, భారతీయ కులవ్యవస్థల్లో భాగంగా వచ్చిన ముఖ్యుల పేర్లే ఉన్నాయి. అంటే కులవ్యవస్థలో ముఖ్యులనే గ్రామంలో రెవెన్యూ యంత్రాంగానికి ప్రతినిధులుగా పెట్టుకొని కులవ్యవస్థను, ఆస్తి వ్యవస్థను ఏ మాత్రం కదిలించకుండా సగభాగం రెవెన్యూ తీసుకొన్నారు. అది ఢిల్లీ సుల్తానులు అయినా, మొగలులైనా, శివాజీ అయినా, కృష్ణదేవరాయలు అయినా, బ్రిటిష్ వాళ్ళు అయినా, ఎవరైనా సరే – కుల ఆస్తి వ్యవస్థగా ఉన్న ఈ గ్రామీణ వ్యవస్థలో ఉత్పత్తి అయిన దాంట్లో నుండి 50 శాతం లేదా అంతకంటే ఎక్కువ తీసుకొని వాళ్ళల్లో వాళ్ళు పంచుకున్నారు. వాళ్ళు ఎవరు అంటే పెద్ద పెద్ద జాగీర్దార్లు కావచ్చు, రాజులు

కావచ్చు, దివాన్లు కావచ్చు, అమాత్యులు కావచ్చు. కింద మాత్రం దేనినీ కదిలించరు. దాదాపు అదే రెవెన్యూ యంత్రాంగం ఈనాటికీ కొనసాగుతూ ఉంది. మొత్తం మన రెవెన్యూ యంత్రాంగానికి సంబంధించిన మాటలన్నీ కూడా పర్షియన్ మాటలే. చివరికి రైతు అన్న మాట కూడా. మనం రైతు అంటే శుద్ధమైన తెలుగు మాట అనుకుంటాం, రైతు అనేది పర్షియన్ మాట. కాపు అనేది తెలుగు మాట. అంటే ఒకనాడు వ్యవసాయదారుడికి అచ్చతెలుగు మాట అయిన కాపు అనేది ఇవ్వాళ ఒక కులం పేరయింది. పర్షియన్ భాష నుండి వచ్చిన రైతు అనేది వ్యవసాయదారుడికి వాడే మామూలు తెలుగు మాట అయింది. ఆ రెవెన్యూ యంత్రాంగం ఆ రోజు ఉన్నటువంటి ఆ గ్రామీణ కుల–వర్గ వ్యవస్థను ముట్టుకోకుండా ఎట్లా పనిచేసిందో అది ఇప్పటికీ అట్లాగే కొనసాగుతున్నది. మార్పులు రాలేదని కాదు, రకరకాల మార్పులొచ్చాయి. రెవెన్యూ యంత్రాంగం వల్లనే కొన్ని వచ్చాయి, పెట్టుబడి ప్రవేశం వల్ల కొన్ని వచ్చాయి. కాని ఈ చరిత్రను అర్థం చేసుకోకపోతే ఇవ్వాళ మన గ్రామాల్లో జరుగుతున్న కుల ఘర్షణల చరిత్ర కూడా మనకు పూర్తిగా అర్థం కాదు.

అందుకే మధ్యయుగాల దగ్గరకు వచ్చేటప్పటికి మనం ఆస్తి, కులం, రెవెన్యూ యంత్రాంగం – ఈ మూడిటిని కలిపి లెక్కలోకి తీసుకోకపోతే మనకు కుల సంబంధాలు అర్థం కావు. కులాలు ఇవ్వాళ ఉన్నట్టుగానే మధ్యయుగాల్లో కూడా ఉన్నాయనుకుంటున్నాం. ఇవాళ కులాలను మనం ఆర్థిక సంబంధాలతో నిమిత్తం లేకుండా అర్థం చేసుకుంటున్నాం. మధ్యయుగాల్లో కూడా అట్లాగే ఉన్నాయని అర్థం చేసుకోవడం కరెక్టు కాదు. ఇవ్వాళ్టి రెడ్డి, అప్పటి రెడ్డీ ఒక్కటే; ఇవ్వాళ్టి కమ్మ, అప్పటి కమ్మ ఒక్కటే; ఇవ్వాళ్టి బ్రాహ్మణుడు అప్పటి బ్రాహ్మణుడు ఒక్కటే అనుకుంటే మనకు చరిత్ర అర్థం కాదు. మూడూ కలిపి అర్థం చేసుకోవాలి. ఆస్తిని అర్థం చేసుకోవాలి, కులాన్ని అర్థం చేసుకోవాలి, రెవెన్యూ యంత్రాంగంలో  స్థానాన్ని అర్థం చేసుకోవాలి.

## మూడు రకాలుగా రెడ్లు కావొచ్చు

నేను ఒకే ఉదాహరణ ఇస్తా. ఇప్పుడు రెడ్డి అనే కులం ఉంది. ఇవాళ దాన్ని కులంగా అర్థం చేసుకొంటున్నాము. కాని మీరు రాయలసీమ జిల్లాలకు గానీ పోతే అక్కడ రెడ్డి ఎవరు అంటే గ్రామ ముఖ్యుడు, అదొక పదవి, రెవెన్యూ యంత్రాంగంలో ఒక హోదా. కోస్తాలో మునసబు అంటారు కదా! మునసబు ఏం చేస్తాడు? గ్రామంలో

రెవెన్యూ వసూలు చేస్తాడు. ఆ మునసబునే రాయలసీమలో రెడ్డి అంటారు. ఆయన కులం ఏదైనా కావచ్చు. అయితే కులం ప్రకారం కూడా అక్కడ ఎక్కువగా రెడ్లే ఉంటారనుకోండి. కాని అతని కులం ఏదైనా కావచ్చు. మా బంధువు ఒకాయన నంద్యాల దగ్గర ఒక గ్రామానికి రెడ్డిగా ఉండేవాడు. కులానికి బ్రాహ్మణుడే కాని గ్రామానికి ఆయన రెడ్డి. అట్లా రెడ్డి అనేది రెవెన్యూ యంత్రాంగంలో ఒక మాట, మునసబు హోదాతో సమానమైనది.

రెడ్డి అనేది రెవెన్యూ యంత్రాంగంలో పదవిని, కులాన్ని కూడా సూచిస్తుందని చెప్పుకున్నాం కదా! అయితే కొంతమంది రెడ్లను నీ కులం ఏమిటి అని అడిగితే కాపు అని చెప్తారు. కాపు అంటే అర్థం ఏమిటి: వ్యవసాయదారుడు. మరి వ్యవసాయదారుడైన వాడు రెడ్డి ఎట్లా అయ్యాడంటే ఒక సామెత ఉంది – 'కాపు బలిస్తే రెడ్డి అవుతాడు' అని. కాపు బలిస్తే రెడ్డవుతాడంటే, ఇవాళ్టి అర్థంలో కాపు కులం వాడు డబ్బు సంపాదించి రెడ్డి అని ప్రకటించుకుంటాడని కాదు. వ్యవసాయదారుడు తన ఆస్తి పెరిగితే రెడ్డి అని చెప్పుకుంటాడు అని. గ్రామ ముఖ్యుడు రెడ్డి కాబట్టి, గ్రామంలో ఆస్తి సంపాదించుకున్న వ్యవసాయదారులందరూ కూడా తామూ రెడ్లమని చెప్పుకుంటారు. ఇది ఆస్తికి సంబంధించినటువంటి విషయం.

ఆస్తి బాగా సంపాదించుకున్న వ్యవసాయదారులు రెడ్డి కావడమనేది ఒక క్రమం. పుట్టుకతో రెడ్డి కావడం ఇంకో క్రమం. అది ఎలాగంటే రెడ్డికి పుట్టినోళ్లు రెడ్లే, వాళ్ళ పిల్లలు రెడ్లే, వాళ్ళు పేదవాళ్ళయినా రెడ్లే, భిక్షగాళ్ళయినా రెడ్లే – అక్కడ అది కులం. మూడోది రెడ్డి అనేది రెవెన్యూ యంత్రాంగంలో ఒక హోదా. ఈ మూడు రకాలుగా కూడా రెడ్డి అనేటటువంటి ఆ కులం విస్తరిస్తూ పోయింది. మేము కాపులు అని చెప్పుకునే వాడు కూడా ఆస్తి సంపాదించుకొని నేను రెడ్డి అని ప్రకటించుకుంటాడు. పేరు చివర్న రెడ్డి పెట్టుకుంటాడు. ఈ రోజు ఇవన్నీ తగ్గిపోయి ఉండొచ్చును పాలిటిక్స్ లో భాగం అయ్యాయి కాబట్టి, కాని 30 ఏళ్ల కింద దాకా ఇది జరుగుతూ ఉంది. రెవెన్యూ యంత్రాంగంలో మునసబు పదవి పొందిన వాడు రెడ్డి అని ప్రకటించుకుంటాడు. అది కులం కూడా కాబట్టి రెడ్డి కులంలో పుట్టినవాళ్ళు, వాళ్లకు హోదా లేకపోయినా, ఆస్తి లేకపోయినా, బిచ్చగాళ్ళైనా, కూలివాళ్ళైనా వాళ్ళు రెడ్లుగానే ఉంటారు. ఈ మూడూ అర్థం కాకపోతే మనకు రెడ్డి అనే కులమే అర్థం కాదు రాయలసీమలో.

కడపలో ఒకాయన ఉన్నాడు. ఆయన పేరు కృష్ణ యాదవ్ రెడ్డి. కృష్ణ యాదవ్ రెడ్డి ఏమిటి? యాదవ ఒక కులం, రెడ్డి ఒక కులం కదా అంటే – వాళ్ళ తాతగారు మునసబు పరీక్ష రాసి పాస్ అయ్యాడంట గానీ ఆయనకు పోస్టింగ్ ఇవ్వలేదంట. పోస్టింగ్ ఇవ్వకపోతేనేమి నేను పాస్ అయ్యాను కదా అని రెడ్డి అని పెట్టుకున్నాడట. ఇప్పుడు ఈయన కృష్ణ యాదవ్ రెడ్డి అని పెట్టుకున్నాడు గానీ తన కొడుకుకు సుధాకర్ రెడ్డి అని పేరు పెట్టాడు, యాదవ్ తీసేసాడు. ఇట్లా రాయలసీమలో చాలామంది రెడ్లు అయ్యారు రెవెన్యూ యంత్రాంగంలోని పదవుల వల్ల. కాపు బలిసి రెడ్డి కావటం అనేది రాయలసీమలోనే కాదు తెలంగాణలో కూడా చూడొచ్చు. కిందటి తరం వరకు కూడా తెలంగాణ జిల్లాలకు పోతే తండ్రి పేరు ఏందంటే లక్ష్మయ్య అంటారు, కొడుకు పేరు ఏందంటే మోహన్ రెడ్డి అంటారు. తండ్రేమో తన కులం కాపు అని చెప్పుకునేవాడు, కొడుకేమో తన కులం రెడ్డి అని చెప్పుకునేవాడు. అంటే ఆస్తి సంపాదించుకున్న తరువాత, ప్రాముఖ్యం సంపాదించుకున్న తరువాత కాపులు రెడ్లు అయ్యారు. ఆర్థికంగా బలిసిన తరువాత కులం మార్చుకోవటం అనేది economic విషయం. అట్లని చెప్పి కేవలం ఎకనామిక్ అందామా? రేపు వాడి ఆస్తి పోతే వాడు రెడ్డి కాకుండా పోతాడా? పోడు. వాడు రెడ్డిగానే ఉంటాడు. వాడి కులం రెడ్డిగానే ఉంటుంది. అందుకే మధ్యయుగాలకు సంబంధించి రెవెన్యూ యంత్రాంగాన్ని, కులాన్ని, ఆస్తిని మూడింటిని కలిపి అర్థం చేసుకోకపోతే మనకు చరిత్ర అర్థం కాదు, సామాజిక వ్యవస్థ అర్థం కాదు.

## కుల, గ్రామీణ వ్యవస్థలలో మార్పులకు ఎవరూ సాహసించలేరు

ఈ ప్రాతిపదిక మీద ఏర్పడినటువంటి గ్రామీణ వ్యవస్థ అనేదాన్ని ఎంతమాత్రం ముట్టుకోకుండా రెవెన్యూ సేకరణ మాత్రమే తమ లక్ష్యంగా పెట్టుకుని పరిపాలించారు మొగలాయి పరిపాలకులు గానీ, ఢిల్లీ సుల్తానులు గానీ. వాళ్ళు ఈ విషయాన్ని బాహాటంగానే ప్రకటించుకున్నారు కూడా. స్థానిక సంప్రదాయాలలో మనం జోక్యం చేసుకోవద్దు అని. చేసుకుంటే తిరుగుబాట్లు వస్తాయి. వేరేమీ కాదు. ఎవరు తిరుగుబాటు చేస్తారు అంటే కులవ్యవస్థను పోగొట్టాలి అనే ప్రయత్నం ముస్లిం రాజులు చేస్తే అగ్రకులాల వారు తిరుగుబాటు చేస్తారు. అగ్రకులాల వారి మద్దతు లేకుండా పరిపాలించటం వారికి వీలు కాదు. వారి సైన్యంలో రాజపుత్రులు వంటి అగ్రకులాలవారు ఉండాలి, బ్రాహ్మణులు

వారికి మంత్రులుగా ఉండాలి. చాలామంది బ్రాహ్మణులు ముస్లిం రాజుల దగ్గర మంత్రులుగా ఉన్నారు కూడా. అందువల్ల తమ పరిపాలనా యంత్రాంగంలో ముఖ్యమైన పదవుల్లో ఉన్నటువంటి క్షత్రియ, బ్రాహ్మణ, అగ్ర శూద్ర కులాల వాళ్ళను దూరం చేసుకోవటం ఇష్టం లేక కుల వ్యవస్థలో జోక్యం చేసుకోవద్దు అనే నిర్ణయానికి మొగలాయి పరిపాలకులు వచ్చారు.

బ్రిటిష్ వాళ్ళు వచ్చిన తరువాత కూడా ఇదే విధంగా కొనసాగింది. మొదట్లో క్రైస్తవ మతం మాత్రమే కాకుండా, ఆధునిక ప్రజాతంత్ర లిబరల్ భావాలు కూడా బ్రిటిషు వాళ్ళ సంప్రదాయంలో భాగం అయినాయి. మొదట వచ్చిన బ్రిటిష్ వాళ్ళలో చాలామంది అంటరానితనాన్ని, కులవ్యవస్థను అసహ్యించుకున్నారు. పుట్టుకతోటే మనిషిని నీచంగా చూసే వ్యవస్థ ఏమిటి? దీన్ని మనం పోగొట్టాలి అని ప్రయత్నం చేశారు. కాని ఒక దశ తర్వాత ఆ పని చేస్తే ఇక్కడ బలవంతులుగా ఉన్న అగ్రకులాల వాళ్ళ నుంచి తిరుగుబాటు వస్తుంది కాబట్టి మనం చేయొద్దు అనే నిర్ణయానికి బ్రిటిష్ ప్రభుత్వం అధికారికంగానే వచ్చింది. అయితే అనధికారికంగా చాలామంది క్రైస్తవ ప్రచారకులు దళితులలో పని చేస్తూ వారి కోసం స్కూళ్ళు పెట్టి చదివించడం ఆ క్రమం సాగింది. దాని వల్ల చాలా మార్పు, చాలా రకాల ప్రయోజనం కూడా మన దేశంలో దళితులకు వచ్చింది.

సిపాయి తిరుగుబాటును ఒక ఉదాహరణగా తీసుకుందాం. సిపాయి తిరుగుబాటు ఎందుకు జరిగింది అనే చర్చ చరిత్రకారులు రకరకాలుగా చేస్తారు కాని బ్రిటిషువాళ్ళు మాత్రం దాంట్లో గుర్తించిన అంశం ఏమిటంటే ఇక్కడి వాళ్ళ కులాచారాలకు విరుద్ధంగా మనం ఏమైనా చేస్తే వాళ్ళు తిరగబడతారనేది. కాబట్టి కులాచారాలకు విరుద్ధంగా పోవద్దు అన్న గుణపాఠాన్ని వాళ్ళు తీసుకున్నారు సిపాయి తిరుగుబాటు నుంచి. వేరే గుణపాఠాలేమి తీసుకున్నారో గాని ఈ గుణపాఠం అయితే తీసుకున్నారు. అప్పటినుండి కులాచారాలలో, కులవ్యవస్థలో జోక్యం చేసుకోవటం బ్రిటిష్ వాళ్ళు మానేశారు. అయితే బ్రిటిష్ వాళ్లు తీసుకొని వచ్చినటువంటి ఆధునిక లిబరల్ ప్రజాతంత్ర భావాలు, పెట్టుబడిదారీ బూర్జువా ప్రజాస్వామ్యం, నేను మొదట్లో చెప్పినట్టుగా, చరిత్రలో మొట్టమొదటిసారిగా మన దేశానికి పౌర ప్రతిపత్తిలో సమానత్వాన్ని (civic equality) తీసుకొచ్చింది.

మామూలుగా మనం ఉద్యమాల్లో బూర్జువా ప్రజాస్వామ్యం అనే దాన్ని అదో పనికిమాలినది అని హీనంగా చూడటం, condemn చేయటం అలవాటయ్యింది కాని

దానిలో కొన్ని మంచి విషయాలు కూడా ఉన్నాయని గుర్తించాలి. నిజమే దానిలో అసమానతను పెంచే అంశాలు ఉన్నాయి, సమానత్వం పేరు మీద బలవంతులకు ఎక్కువ హక్కులిచ్చే అంశాలున్నాయి. అవన్నీ ఉన్నాయి, కాదనటం లేదు కాని దాంట్లో కొన్ని మౌలిక ప్రజాతంత్ర సూత్రాలు కూడా ఉన్నాయి. అందులో ఒకటి పౌర ప్రతిపత్తిలో సమానత్వం. అంతకు ముందున్న ఏ వ్యవస్థలో ఎక్కడా లేదది. కులవ్యవస్థలో అయితే అది సంపూర్ణంగా నిరాకరించబడింది. ఇతర దేశాల్లో సంపూర్ణంగా కాకపోయినా ఏదో ఒక మేరకు నిరాకరించబడింది. మొట్టమొదటిసారిగా ఈ సివిక్ ఈక్వాలిటీ అనేది – పౌర, సాంఘిక సమాన ప్రతిపత్తి అనేది వాళ్ళ ద్వారానే చట్టాల్లో వచ్చింది. 1860 ల్లో తయారు చేసిన CrPC, CPC లో, బ్రిటిష్ కోర్టులలో ఇది కనిపిస్తుంది. అది చాలామందిలో ఆలోచన రేపింది. బ్రిటిష్ వాళ్ళు అనుకోవచ్చు, మేము జోక్యం చేసుకోము అని. కానీ వారి పరిపాలన, ఆ పరిపాలనలో వాళ్ళు ప్రవేశపెట్టిన చట్టాలు, వారి ఇంగ్లీష్ చదువులు వాటి నుంచి చాలామంది మనిషి, మానవుడు గురించి ఆలోచించడం మొదలుపెట్టారు. జ్యోతిబా పూలే చాలా గట్టిగా చెప్తాడు, మానవ హక్కులు, మనిషి, మానవ సమాజం అని మాట్లాడాలంటే మనిషికి మనిషిగా ముందు గుర్తింపు ఉండాలి అని. బ్రాహ్మణీయ సమాజం ఏం చెపుతుందంటే నువ్వు అసలు మనిషిగా పుట్టవు, ఒక వర్ణానికి చెందినవాడిగానే పుడతావు అంటుంది. పురుషసూక్తంలో దేవుడే మనిషిని ఆ విధంగా పుట్టించాడు అంటారు. పుట్టించినాక విభజించాడు అంటే పోనీ అనుకోవచ్చు. అట్లా కూడా అనలేదు. పుట్టుకతోనే డైరెక్టుగా వర్ణాలలో పుట్టించాడు, మనుషులుగా పుట్టించలేదని చెపుతారు. తల నుంచి బ్రాహ్మణులను పుట్టించాడు, భుజాల నుంచి క్షత్రియులను పుట్టించాడు, తొడల నుంచి వైశ్యులను పుట్టించాడు, పాదాల నుంచి శూద్రులను పుట్టించాడు అని చెపుతారు. దేవుడు ముందుగా మనుషులను పుట్టించి ఆ తర్వాత విభజించాడన్నా కొంచెమైనా బాగుండేది.

## మనిషి భావనకే చోటు లేనిది బ్రాహ్మణ మతం

అంటే మనిషి, మానవుడు అనే భావన (కాన్సెప్ట్) కే చోటు లేనిది బ్రాహ్మణ మతం. పాశ్చాత్య ప్రజాతంత్ర విప్లవాల్లో భాగంగా వోల్టయిర్, రూసోలు సహజ హక్కులు అనే కాన్సెప్ట్ తీసుకొచ్చారు. ఈ రచనలు చదివి జ్యోతిబా పూలే చాలా inspire అయ్యారు. దేవుడు ఇచ్చాడా, ప్రకృతి ఇచ్చిందా, ప్రకృతిసిద్ధంగా వచ్చిందా అని కాదు, సహజ హక్కుల కాన్సెప్ట్ ఏమిటంటే మనిషై పుట్టినందుకు మనిషిగా నాకు ఉండే హక్కులు హ్యూమన్

రైట్స్. ఆ కాన్సెప్ట్ కే చోటు లేనిది ఈ బ్రాహ్మణీయ మతం అనేది. అక్కడ నుండి మొదలుపెట్టి కులవ్యవస్థను వ్యతిరేకించకపోతే, దాన్ని మొత్తం తలక్రిందులు చేయకపోతే ఇదొక మానవ సమాజమే కాదు అనే కాన్సెప్ట్ బ్రిటిషువాళ్ళు ప్రవేశపెట్టినటువంటి విద్య నుంచి, విజ్ఞానం నుంచి మనకు వచ్చింది. దాన్ని అందుకుని చాలా ముందుకు పోయినటువంటి సంస్కర్తలు కాయస్త, బ్రాహ్మణ కులాల్లో పుట్టి ఉండవచ్చు కాని వాళ్ళు కేవలం తమ కులాల ఆధిపత్యాన్ని కొనసాగించటం కోసం సంస్కరణలు ప్రవేశపెట్టారు అని వ్యాఖ్యానించాల్సిన అవసరమేమీ లేదు. వాళ్ళ పరిధుల్లో, వాళ్ళ పరిమితుల్లో వాళ్ళు వితంతు పునర్వివాహాల గురించి, బాల్య వివాహాల నిషేధం గురించి కృషి చేశారు. వారి కృషి తమ కులాలలో ఉన్నటువంటి దురాచారాల గురించే అయినప్పటికీ, అది మొత్తంగానే బ్రాహ్మణీయ భావజాలాన్ని, బ్రాహ్మణీయ సంస్కృతిని దెబ్బతీస్తుంది కాబట్టి వారి కృషి మొత్తంగా సమాజానికి ఉపయోగపడే కృషే–వాళ్ళ పరిమితులు ఏమున్నా.

అంతకంటే ఎక్కువగా మహారాష్ట్రలో జ్యోతిబా ఫూలే, తమిళనాడులో రామస్వామి పెరియార్, తరువాతి కాలంలో అంబేద్కర్ ఇటువంటి వాళ్ళు మరింత సమగ్రంగా, సంపూర్ణంగా కులవ్యవస్థను సమూలంగా తొలగించాలి అని, అప్పుడు తప్ప మనిషి, మానవత అనేది ఆవిష్కరించబడదు అనే కాన్సెప్ట్‌ను ముందుకు తీసుకొచ్చారు. భావజాల రంగంలో, రాజకీయ రంగంలో, తాత్విక రంగంలో ఈ మార్పులు జరుగుతుండగా, బ్రిటిష్ వాళ్ళు తీసుకొచ్చినటువంటి పెట్టుబడిదారీ సంబంధాలు కులవ్యవస్థలో కూడా కొన్ని రకాల మార్పులను తీసుకొచ్చింది. చాలా మామూలుగా చెప్తుంటారు – వాళ్ళు రైళ్లు ప్రవేశపెట్టారు, బస్సులు ప్రవేశపెట్టారు అని. రైళ్లలో ఎవరైనా పక్కన కూర్చుంటారు, హోటళ్లలో ఎవరైనా పక్కన కూర్చొని తింటారు. రైలెక్కినప్పుడు చేయొచ్చు ఆ పని; కానీ ఇంటికి వచ్చినాక మాత్రం అంటుముట్టు పాటించడం కొనసాగుతూనే ఉంటుంది. అయినప్పటికీ అది కొంత మార్పు. నగరాల్లో, పట్టణాల్లో జీవించేటప్పుడు తప్పదు. ఇప్పటికీ చాలా పట్టణాలు, చాలా నగరాలు వాడలు వాడలుగా డివైడ్ అయి ఉంటాయి. కమ్మవాళ్ళు ఇక్కడ, బ్రాహ్మణులు ఇక్కడ, రెడ్లు ఇక్కడ ఉంటారనేది కొంత ఉంటుంది. అయినప్పటికీ కొంతవరకు సహజీవనం కూడా అలవాటవుతుంది. ఇది ఒక పార్శ్వం. అలాగే ఫ్యాక్టరీల్లో పని చేసేటప్పుడు కొంతవరకు సహజీవనం అలవాటు అవుతుంది. అక్కడ కూడా చాలా వివక్ష ఉన్నప్పటికీ, కొంత అలవాటు అవుతుంది. ఇవన్నీ పెట్టుబడి యొక్క వ్యాప్తి, ఆధునిక టెక్నాలజీ వల్ల వచ్చే కొన్ని మార్పులు.

## పెట్టుబడిదారీ సంబంధాలు వచ్చినా మార్పు లేదు

అయితే ఇంకొక వైపు భారతదేశంలో ఏం జరిగింది అంటే పెట్టుబడిదారీ వ్యవస్థ భారతదేశంలోకి సంప్రదాయక కులవ్యవస్థను, భూస్వామ్య వ్యవస్థలో ప్రధానమైన పాత్ర నిర్వర్తించినటువంటి వర్ణవ్యవస్థను ధ్వంసం చేసి ప్రవేశించలేదు, దానిని అట్లా కాపాడుతూనే ప్రవేశించింది. మొగలాయి పాలకులు ఏం చేశారో, ఢిల్లీ సుల్తానులు ఏం చేశారో, బ్రిటిష్ వాళ్ళు కూడా అదే చేశారు. వాళ్లకు కావలసింది రెవెన్యూ మాత్రమే. ఆ రెవెన్యూను గ్రామీణ కుల–వర్గ వ్యవస్థను కదిలించకుండా తీసుకున్నారు వాళ్ళు. మొదటినుండి అదే రెవెన్యూ యంత్రాంగమే, షేర్ షా యంత్రాంగమే బ్రిటిష్ వాళ్ళ యంత్రాంగం కూడా. పేర్లు మాత్రమే మారాయి. సుబేదారు పోయి కలెక్టర్ పేరొచ్చింది. అందువల్ల ఏమయ్యింది అంటే కులవ్యవస్థ గాని, వర్ణవ్యవస్థ గాని, వర్ణధర్మం గాని వాటిని ధ్వంసం చేసే పద్ధతిలో పెట్టుబడిదారీ సంబంధాలు భారతదేశంలో ప్రవేశించలేదు. వాటిని కాపాడుతూనే ప్రవేశించాయి కాబట్టి కాలక్రమంలో ఏం జరిగింది అంటే కులం అనేది కొన్ని రూపాల్లో మాత్రమే బలహీనమయ్యింది. పెట్టుబడి వల్ల కొంత బలహీనమయ్యింది, సాంకేతిక మార్పుల వల్ల కొంత బలహీనమయ్యింది, బ్రిటిష్ వాళ్ళు తీసుకొచ్చినటువంటి ఆధునిక ప్రజాతంత్ర లిబరల్ భావాల వల్ల కొంత బలహీనమయ్యింది. అదే సమయంలో వేరే కొన్ని రూపాలలో కులం బలపడింది.

ఎందుకంటే పెట్టుబడిదారీ వ్యవస్థలో పోటీ అనేది చాలా ముఖ్యమైన విషయం. మనిషికి భద్రత ఉండదు. సంప్రదాయక సమాజాలు అణచివేతలో కూడా మనిషికి కొంత భద్రతను కల్పిస్తాయి. నీ స్థానం ఇది, నీ స్థానంలో నువ్వుంటే నీకు ఇంత కూడు దొరుకుతుంది అని చెపుతాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ ఏమంటుందంటే నీకు చేతనైతే నీ శ్రమ అమ్ముకొని బ్రతుకు, అది సాధ్యం కాకపోతే ఆకలికి చావు అంటుంది. సెక్యూరిటీ లేనటువంటి వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థ. ఇది పేదవాళ్లకు మాత్రమే కాదు, పెట్టుబడిదారులకైనా సరే, మధ్యతరగతి వాళ్ళకైనా సరే, జీవిత సంఘర్షణను చాలా పెంచుతుంది. Struggle for existence ను పెట్టుబడిదారీ వ్యవస్థ చాలా పెంచుతుంది కాబట్టి, ఈ జీవిత సంఘర్షణలో నా వాళ్లు, మన వాళ్ళు అని ముఠాలు కట్టటం, గుంపులు కట్టటం, వర్గాలను చేరదీయటం ఎక్కువగా జరుగుతుంది. దాంట్లో భాగంగా కులాలు

మార్కెట్ రూపంలో, మార్కెట్ వ్యవస్థలో భాగంగా మళ్ళీ బలపడటం మనం చూస్తూనే ఉన్నాము. రాజకీయ ఘర్షణల్లో, ఆర్థిక ఘర్షణల్లో, ఆస్తుల కోసం ఘర్షణల్లో, అలాగే రాజకీయ ఆధిపత్యం కోసం, ఆస్తుల సంపాదన కోసం తమ కులం వాళ్ళను పోగు వేసుకోవడం మనం చూస్తూనే ఉన్నాం. పెట్టుబడి కులాన్ని ధ్వంసం చేసి ప్రవేశించి ఉంటే, ప్రజాతంత్ర విప్లవం అనేది సంపూర్ణంగా జరిగి ఉంటే, ఇది జరగకపోయేదేమో! అది జరుగుతుందా, జరిగుండేదా, ఏ రకంగా జరిగి ఉండాలి, ఆ చర్చ కొంచెం సేపు పక్కకు పెడదాం. అట్లా ప్రవేశించకుండా, కులవ్యవస్థను ముట్టుకోకుండా, దాన్ని కాపాడుకుంటూ ఇది సమాంతరంగా ప్రవేశించడం వల్ల ఏం జరిగిందంటే పెట్టుబడి కులంలోకి కూడా ఎంటర్ అయ్యింది. పెట్టుబడిదారీ సమాజం సహజంగా సృష్టించే సంఘర్షణలో కులం కూడా ఒక సాధనంగా, ఒక ఆయుధంగా మారింది. సాంప్రదాయక కుల వివక్ష, సాంప్రదాయక కుల అణచివేత కొంత తగ్గినా వేరే రూపాలలో కొనసాగుతూనే ఉన్నాయి.

*(ఈ ఉపన్యాసంలో చివరి భాగం దొరకలేదు. మధ్యలో కూడా అక్కడక్కడ కొంత భాగం రికార్డు కాలేదు. ఇది ఎక్కడ ఎప్పుడు మాట్లాడారో ఆ వివరాలు కూడా తెలియవు. సుమారుగా 1995-96 లో కావచ్చు.)*

❄

భారతదేశంలో గ్రామీణ వ్యవసాయిక సమాజం మౌర్య చంద్రగుప్తుల కాలం దగ్గర మొదలయ్యి, కొంచెం కొంచెంగా ఏర్పడుతూ వచ్చి, గుప్త రాజుల కాలానికి బ్రహ్మాండంగా విస్తరించింది. దీని పైన ఆధిక్యత మాత్రం మారుతూ వచ్చింది. వివిధ సమయాలలో వేరు వేరు రాజ్యాలు, రకరకాల మతాలు ఆ వ్యవస్థపై పెత్తనం చెలాయిస్తూ వచ్చాయి. గ్రామీణ వ్యవసాయిక సమాజం ఏర్పడ్డాక ముస్లిం పాలకులు వచ్చారు, ఢిల్లీ సుల్తానులు వచ్చారు, బ్రిటిష్ వాళ్ళు కూడా వచ్చారు. ఢిల్లీ సుల్తానులు అందరూ మతోన్మాదులేమీ కారు, అలాగే మొగల్స్ అందరూ కూడా మతోన్మాదులేమీ కారు. అయితే వాళ్ళ మతాన్ని వాళ్ళు నమ్మారు. అంతే కాదు, మన కులవ్యవస్థ చాలా అనాగరికం అని కూడా వాళ్ళు నమ్మారు. బ్రిటిషు వాళ్ళకు క్రైస్తవ మతమే కాకుండా, ఆధునిక ప్రజాతంత్ర భావాలు కూడా ఉన్నాయి. అయినప్పటికీ ఈ గ్రామీణ వ్యవస్థను గానీ, కులవ్యవస్థను గానీ, దానిలో ఉన్నటువంటి ఆస్తి సంబంధాలను గానీ మౌలికంగా మార్చే ప్రయత్నం ఎవ్వరూ చేయలేదు. భారతదేశంలో ఇప్పటికీ అదే అలాగే కొనసాగుతూ ఉంది. పెట్టుబడిదారీ వ్యవస్థ రావడం వల్ల, వ్యవసాయ వ్యాపారీకరణ జరగడం వల్ల కొన్ని మార్పులు వచ్చినప్పటికీ మౌలికమైన మార్పులు ఎవరూ తీసుకురాలేదు.



"మౌలికంగా మనం వర్ణవ్యవస్థను గానీ, కులవ్యవస్థను గానీ అర్థం చేసుకునేటప్పుడు ఉత్పత్తి వ్యవస్థ నుండి విడదీసి దాన్ని అర్థం చేసుకోవటం చాలా పొరపాటు. అట్లా అని ఉత్పత్తి వ్యవస్థను అర్థం చేసుకుంటే కులం మొత్తం అర్థమైపోతుందని కాదు. నిజానికి ఉత్పత్తి వ్యవస్థను మొత్తం అర్థం చేసుకుంటే సమాజం, చరిత్ర అన్నీ అర్థమయిపోతాయి అనే మార్క్సిస్టు ప్రతిపాదన వాస్తవమేనా అనేది చాలా పెద్ద ప్రశ్న. అది ప్రస్తుతానికి పక్కకు పెడదాం. కానీ ఉత్పత్తి వ్యవస్థను అర్థం చేసుకోకపోతే మాత్రం మనకు కులం అర్థం కాదు.....

ప్రాచీన కాలంలో స్థిరపడుతున్నటువంటి వ్యవసాయక సమాజాన్నీ; మధ్యయుగాల్లో స్థిరపడినటువంటి వ్యవసాయక సమాజంతో పాటు రెవెన్యూ యంత్రాంగాన్నీ; ఆధునిక కాలంలో వీటితో పాటు పెట్టుబడిదారీ సంబంధాలను కూడా లెక్కలోకి తీసుకుంటేనే మనకు వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ అనేవి సమగ్రంగా అర్థం కావచ్చు."

Rs. 50/-

**మానవ హక్కుల వేదిక ప్రచురణ**